

# అంకితము



ఉ. చిన్నతనంబునందు మనసుం జేరఁగఁదీసి కుమారురీతిగా
మన్ననఁ గోడఁ జెంది మది మాన్యముల న్గడుఁ జక్కఁజేసి పే
రున్నతి గల్గు వాఁడవగు దోయి! యటంచు వచించినట్టి నా
యన్నయ సుబ్రమణ్యమున కంకిత మిచ్చెద నాదు గ్రంథముల్.



# పీఠిక

కవి సత్తములారా !

నేనీ వరవిక్రయనాటకంబు నిదివఱకే రచియించితిని. కొన్ని కారణాంతరములచేత నచ్చు నొత్తించలేకఁ బోతిని. అందువలన నాటకమింత వఱకుఁ బయటకు రాలేదు. శ్రీ గొల్లపూడి వీరాస్వామిగారి ప్రోత్సాహము చేతను నామిత్రుల ప్రోత్సాహము చేతను నేనీ నాటకము, ప్రకాశకులగు శ్రీ గొల్లపూడి వీరాస్వామిగారి కొసంగితిని. వారీ నాటకము నచ్చు నొత్తించి ప్రకాశింపఁ జేసినందుకు, నచిరకాలమునకే వెల్లడిలోనికిఁ దెచ్చి నన్ను గౌరవించినందుకు నావందన శతంబు లర్పించుచున్నాఁడను.

ఇట్లు
గ్రంథకర్త.
గరికిపాటి కామేశ్వరరావు.
రాజమండ్రి.



# ఇందువచ్చు పాత్రములు



పురుషులు.

కోకాల సుందర శివరావు—పెండ్లికూతురు తండ్రి

లోభిశాయ్య లింగయ్య—పెండ్లికుమారుని తండ్రి

బసవయ్యశాస్త్రి—పెండ్లికుమారుడు

అడావిడి అంకయ్య  పెండ్లిపెద్దలు
కార్యాలకామయ్య

కామయ్య—వంటబ్రాహ్మణుడు

వెంగళిశాస్త్రి—ప్లీడరు

న్యాయాధిపతి—

కోమటి కోటయ్య—షరాబు

ఇంకా కొందఱు సందర్భానుసారముగా వత్తురు.

స్త్రీలు.

నీలాంబరి—1 వ పెండ్లికూతురు

కనకాంబ—2వ పెండ్లికూతురు

గుణవతి—సుందర శివరావు భార్య





శ్రీ

# వరవిక్రయము



నాంది.

శా. బ్రహ్మాండంబు సృజింపఁ బెంప సమయింపన్ శక్తియున్నట్టియా
బ్రహ్మోపేంద్ర మహేశ్వరాదు లిల సంపాదించుచుం భాగ్యముల్
బ్రహ్మజ్ఞాన మహానురాజ్యయము సంభావించుచుం బ్రోచు నా
బ్రాహ్మీదేవత వర్గముం నట సభం బాలించు నశ్రాంతముం.

ఉ. కూళను దాటకిన్ దునిమి క్రూరమరీచను బాహుదైత్యులన్
నేలను గూలఁ జేసి క్రతు నేర్పరివైమును గాధినందనున్
గ్రాలగ జన్నముల్ దవముఁ గాచితినంటి దయావిహీనతన్
వేలక రామచంద్ర సిరి నేలుము భూరిసభప్రజావళిన్.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—(ప్రవేశించి) నటీ! నీవు సత్వరంబిటులోక మారు రమ్ము,

నటి—(ప్రవేశించి) నాథా! తామీ దినమున నన్నింత వేగమే రాఁబిలిచిన కారణం బేమియో నే నెఱుంగ వచ్చునా?

సూత్ర—నటకులందఱు సిద్ధముగా నున్నారు. నూతన నాటక మాడవలయునని నాయభిప్రాయము.

నటి—సంఘదురాచారమును చక్కగా బోధించు వరవిక్రయము నాటకమున్నది. దాని నాడుదమా?

సూత్ర—కవిపేరేమా! నేనడుగ వచ్చునా?

నటి—కవినామధేయమా! అది యెందుకు?

ఉ. బాలకవీశ్వరుండు పసి ప్రాయమునందె రచించె భూరికా
వ్యాళి రచించె నాటకము లందము చందము చెందు భంగిని
కాల్పలమునందు సత్కవుల కంజపదంబుల నాశ్రయించి పే
రోలగమున్న వారు విభవోజ్జ్వలుఁ జేయుతఁ దత్కవీశునిన్.

సూత్ర—(సందేహించుచు) ఓహో! కామేశ్వరరావా!

నటి—నాథా! సందియమెందుకు? బాలుఁడనియా మీయభి
ప్రాయము.

సూత్ర—బాలుఁడసి కాదు. అతఁడప్పుడే కవీశ్వరుఁడైనందున నాహృదయకంజ మానందించుచున్నది. సరియే! దీనినిఁ బ్రదర్శించి సభ్యులను సంతోషాంతరంగులుగఁ జేయుదము, నీవు ముందుగాయి పాత్రలను సిద్ధము చేయుము.

(తెర వ్రాలును)





# వరవిక్రయము.



## ప్రథమాంకము

(రంగము:—ప్రదేశము. గృహము)

ప్రవేశము—కనకాంబ-నీలాంబరి

కన—అక్కా! నాయనగారు నీతో నూలువడకమని చెప్పి వెళ్ళినారుగదా? యీపూట నూలువడుకుట మానివేసితి వేమి?

నీలాం—నేఁడెందుచేతనో నాకు చెయ్యి రాట్నముమీఁదికి బోవుట లేదే! నాయనగారు పొద్దునఁ బోయినపోక, యింతవఱకు భోజనము చేయలేదుకదా?

కన—అవును. నాయనగారికిప్పుడేమిపనియున్నది, మన పెండ్లి కొఱకుఁ బిచ్చియెత్తినట్లు తిరుగుచున్నారు.

నీలాం—ఏమిచేయుమనెదవు! ఆఁడుపిల్లలంగన్న తరువాత తల్లిదండ్రులకిదియే యవస్థ.

కన—అయినను. యీదినములలో కట్నములు పోయకుండిన వరుఁడు దొఱకుట లేదుకదా?

నీలాం—అందుచేతనే! నాయనగారిట్టి శ్రమపడవలసివచ్చినది. రెండుమాసములనుంచి తండ్రిగారీవిధముగాఁ గష్టపడుచున్నను-సంబంధము కుదురుటకు కష్టతరముగానున్నదికదా?

కమ—అక్కా! యేమి విపరీత కాలమువచ్చినది. ప్రతివానికిఁ గట్నములయందాశ జనించినది. దినదిన ప్రవర్ధమానము కాఁజొచ్చినది.

నీలాం—హుష్! ఊరకుండుము. అదిగో వీధితలుపు చప్పుడు. నాన్నగారు వచ్చుచున్నారు.

సుంద—(ఆయాసముతోఁ ప్రవేశించి) అమ్మాయీ! మీయమ్మ యేది?

నీలాం—లోన వంటఁ జేయుచున్నట్లున్నది, వెళ్ళి పిలుచుకు రానా?

కమ—అక్కా! వంటఁ జేయుటలేదు. వంటయి చాలా సేపయినది.

సుంద—అట్లయిన నేమి చేయుచున్నదో! లోనికిఁబోయి ఒకపర్యాయము తీసికొనిరా?

(ఇద్దఱు లోనికిఁ బోవుదురు)

గుణవతి—(ప్రవేశము) ఇదేమి! నేఁడింత సేపున్నారు. భోజనమునకు లెండు.

సుంద—పిచ్చిదానా! ఇంకెక్కడి భోజనము. ఎక్కడియూరు.

తే॥ గీ॥ కంటిలోనున్న నలుసుల కరణిగాదె
వెన్నుపై లేచుకురుపుల విధముగాదె
వరుఁనిజూచి వివాహము జరుపుటిపుడు
కటకటా! యిట్టి దురవస్థఁ గాంచఁగలనె.

మరియు,

తే॥ గీ॥ తగినవానిఁజూచి భూతలమునందు
కన్యనిచ్చి సంతోషంబు గాంతుమన్న
కట్నములబాధచేఁ గన్యఁ గంటిమేల
ననుమహావ్యాధి జనియించె నాత్మలోన.

గుణ—ఇంతకుఁ బండా? కాయా?

ప్రథమాంకము.

సుంద — పెద్దనానా! యేమి చెప్పమనియెదవు.

తే॥ గీ॥ చెడెను ధర్మంబునీతి వి | శేషముగను
పూర్వమర్యాదనశియించె | గర్వమధిక
మయ్యె కట్నము లేదవ | లాత్మలోనఁ
బలువరించెడు శుంఠలు | ప్రబలినారు.

మరియు.

ఉ. పూర్వము పుంతపాటి ఘన | పూజ లొసంగఁగలేరు పెండ్లికై
నుర్విని యాడుబిడ్డలకు | నోపఁడెఁ తీవినుమా! యిదేమిటో
సర్వముఁ జూచినన్ వరుఁడు | సంతను వస్తువులమ్మునట్లుగా
గర్వముతో ధనంబుకుఁ | గన్యను బెండిలిఁ జేసికొమ్మనన్.

ఇంతకు నాకేమియుఁ దోచక నూరంతయుఁ దిరిగినాను.

గుణ — పోని- కాలేజిలోఁ జూచితిరా?

సుంద — కాలేజి యంతయుఁ గాళ్ళరుగఁ దిరిగినాను, చేసినపని పీసమెత్తు లేదు. కాలేజీలో నున్నంత ఘోరమెందునుఁగానము,

గుణ — కాలేజిలో మన అమ్మాయికిఁ దగినవరుఁడు లేఁడా?

సుంద — లేకేమి! లెక్కలేనంతమందియున్నారు. వారలకుఁ గావలసినదొక్కటే కాదు. అన్నియుఁ గావలయును. పెండ్లి కావలయు వారు మూఁడుతరగతులుగా నున్నారు, వారికి మూఁడువిధములుగాఁ గట్నమియ్యవలెనఁట! అయినను యింకా లాంఛనములు దండిగా ముట్టఁజెప్పవలయునఁట. మొదటితరగతివానికి మూఁడువేలు, రెండవతరగతివానికి నాలుగువేలు, మూఁడవతరగతివాని కయిదువేలు, అవయిని ఆస్తి యేమయిన నున్నచో నంతకు రెండురెట్లుగా ముట్టజెప్పవలయునఁట. తరువాత పండుగులకు, పర్వాలకుతీసికొనివెళ్ళవలయునఁట. ప్రధానము ఘనముగా జరుపవలయునఁట. తరువాత,

సీ॥ కాలేజికిన్ బోవఁ - గష్టమయ్యెనటంచు
సైకిలుఁ గోరెడు - చవట యొకఁడు
నీటైన దుస్తులుఁ - గోటువాచియు
షోకు గావలెనను - శుంఠ యొకఁడు
చదువును పూర్తిగాఁ - జదివింపవలెనని
కోరు నిర్భాగ్యపు - కూళ యొకఁడు
శాలువు కండువా - సంక్రాంతి నాటికి
కొనిపెట్టవలెనను - కూళ యొకఁడు
గీ॥ అయిదు వేళ్లకు ఉంగ్రాలు - అడుగు నొకఁడు
వరులు పెక్కు చందాలను - వాంఛలమరి
సిగ్గు నావంత లేక వి - శేషముగను
తెల్పుచున్నారు కోరికల్ - దేటగాను.

గుణ—వారియొక్క నడవడిక లెట్టిది ?

సుంద—ఆవిషయములో నేఁ జెప్పవలయునా! నేఁజెప్పనక్కఱ లేకుండగనే నీకుఁదెలియును.

సీ॥ బెంగాలి క్రాపింగు - పెడపాపిడిని దీసి
రిస్టువాచీనిధ - రించు వాఁడు
మీసాలు సన్నగా - మిషనుతోఁ గత్తిరించి
నడిబజారులలోన - నడచువాఁడు
తండ్రి గడించిన - ధనములో లేనిపో
యిన ఖర్చులన్నివ - హించువాఁడు
చుట్టలు సిగరెట్లు - సోడాలు కొట్లలో
ఖాతాల వెన్నియో - కలుగువాఁడు
గీ॥ కాఫి హోటలులోఁబోయి చ - క్కఁగ భుజించి
ద్రవ్యము లేక పత్రంబు - వ్రాయువాఁడు

విశ్వవిద్యాలయంబులో । వెలఁగొలఁది
ఇట్టులున్నారు విద్యార్థు । లెంచిచూడ.

గుణ—అట్లయినచో వారికింకను చదువెందుకు? వారి తల్లిదండ్రులీ చదువు నేలమాన్పింపరో?

సుంద—ఈదినములలో చదువులు మాన్పించుటయెట్లు? చదువులు ముఖ్యముగా కట్నముల కొఱకేగాని విద్యకొఱకుఁగాదు. పొరుగూరునుంచి వచ్చిన పుల్లయ్యకూఁడా చదువుకొని కట్నము లాగుదమనే వుద్దేశమేకదా? అందుకనే వారాలుచేసికొని క్రిందమీఁద బడి యేదో రెండుఅక్షరములు నేర్చుకొని "పిల్లవాఁడు యోగ్యుఁడే కదా" యని పిల్లనివ్వఁబోతే కట్నమునకు కసరుచున్నారుగాదా? నీవెఱుఁగని దేమున్నది.

గుణ—ఇట్టి వెంగలికిచ్చుటకంటె నేనూతనోగోతనో పిల్లను బడఁద్రోయుట మేలుగదా? ఇఁక మనమేమి చేయఁగలము.

సుంద—వెఱ్ఱిదానా! ప్రస్తుతము కట్నములియ్యనిదే కన్యకుఁ బెండ్లియగునా?

చ॥ కలరుప్రధానపూరుషులు । కట్నములిచ్చెడివారు పెండియుం
గలరుదురాత్ములెందఱో ప । కావకనవ్వెడివారు కన్యకున్
వెలగలభర్త లేనితఱి । హీనముదోషములేనిదేప్రజల్
చులకనచేయుచుందురు వ । సుంధరకట్నములేకసాగునే॥

గుణ—అన్నట్లు సంఘసంస్కరణముకొఱకు మీతోఁబాటు పడిన వారెందఱో యున్నారుకదా? వారికెవ్వరికిని పెండ్లి కావలసిన పిల్లవాండ్రులేరా? వారిప్పుడు మీతో నేమనుచున్నారు?

సుంద—ఏమనుచున్నారా! గంగలో దిగమనుచున్నారు—నీవు చెప్పినట్లుగానే వారి దగ్గఱకు వెళ్ళి సంఘదురాచారంబీ స్థితిగా

నున్నదని చెప్పినాను. అంతట వారు మీసాలుదువ్వుచు సంఘదురాచారములను దూషించి, మూడగ్గలనే వయసువచ్చిన పిల్లకాయలున్నారని చెప్పి వారించి నన్ను యింటికిఁ బంపించినారు.

గుణ—అట్లయిన వారితో సంబంధము నిశ్చయించుకొని రాకపోయినారా ?

సుంద—ఏమిలాభము—నోటికి వచ్చినట్లు పేలుటయే కాని, పట్టుదల వచ్చినప్పుడు సున్న. ఇన్నిమాటలు మొన్ననాతోఁ జెప్పిన విసనకర్రవీరయ్యగారు అయిదు వేల అయిదువందలు కట్నము పుచ్చుకొని వివాహము నిశ్చయించుకున్నారు. అదేమన; ఇంట్లోఆడువారి పోరన్నారు. సరే దానికేమిగాని రెండు మాసములనుంచి బాల్యవివాహము మాన్పింపవలయునని పాటుబడుచున్న పాపయ్యగా రేమి చేసినారో విన్నావా ? పుణ్యము పాపము నెఱుఁగని వాగ్దేండ్ల నాగమ్మను, నలుబదియేండ్లు నిండిన నాలుగవపెండ్లి వానికిఁ గట్టిపెట్టినారు. అంతకన్న సిగ్గేమన్నా వున్నదీ ! అది యటుండనిమ్ము; కట్నములుపుచ్చుకోవద్దని గంతులువేసిన కామయ్యగారు ఇండ్లు మాన్యములు అమ్మించి పదివేల రూపాయలు కట్నము పుచ్చుకొని తమ్మునికిఁ బెండ్లిచేసినారు. వితంతు వివాహములనుగురించి వేదికలపై నుక్కిరిబిక్కిరయి, ఉపన్యాసము లిచ్చిన చింతపండు శీతయ్యగా రేమి చేసినారో విన్నావా ? చెల్లెలికి భర్త చావఁగానే వితంతువుకు వివాహముచేయఁ గూడదని, యింట్లో నీళ్ళమనిషిని మాన్పించి నీళ్ళబిందిచ్చి నూతికిఁబోయి నీళ్ళు తెమ్మన్నారు. అంతకన్న ఘోరమున్నదా ? సంఘసంస్కర్తలీవిధముగా నున్నారు. పేలాపనతప్ప ప్రజ్ఞావిశేషములు శూన్యము. పట్టుదలయున్న, కోపము కోసెడు, ఆలోచన అసలేలేదు. గాంభీర్యము గంపెడు. ఇవితప్ప రెండవదేమియు లేదు, కార్యము వచ్చేసరికి క్రియ శూన్యము.

గుణ—అయినను—అందఱి నొకసారి యడిగిచూడఁగఁ బోయి నారా ?

సుంద—మొట్ట మొదట నేను చెప్పలేదూ? విఘ్నకర్త వీరయ్య గారు చేసిన వింతలు. ఎవరితోఁ బ్రస్తాపించినను; సరే చూద్దామనే వారేకాని సంగతి సరిగా చెప్పేవారు లేరు.

గుణ—అవును. కట్నములు కానుకలు పుట్టఁజెప్పనిదే యీ రోజులలో వివాహముఁ జేసికొనే వారెవరు. ఆడవారిమాటయే ముఖ్యమయినప్పుడు మగవారుమాత్ర మేమి చేయఁగలరు.

తే॥ గీ॥ కట్నములు లేని పెండ్లి యే పట్నమందు
జరుగఁబో దిఁక ముందు ని శ్శాంతి లేమి
గృహములన్నియుఁ గూరాకు కుప్ప చేత
నిండియున్నను కట్నాల కందుగద్యో!

తినుటకుఁ దిండిలేక పోయినను కట్నములు లాగుదమనియే యిప్పటి వారి మనోగతములు. అహా! దేశమెంత దురాచారభూయిష్ఠమయి పోయినది.

సుంద—అదిగో నీ చేసారపాటుమాట. ఆడువాళ్ళమాటయే యీరోజులలో ముఖ్యావసరమయినది. మగవారేమి చేయఁగలరు. ఆడుదానిమాట కెంతెను త్రిము నడుగుదాఁట కూడదని కదా? ఇప్పుడు దేశాచారము.

తే॥ గీ॥ ఆడువారల ముందు నె క్కలుగుడైన
వేయుశక్యమె మగవారు వేశ్య విటునిఁ
బాము చందాన భార్యగ న్పురుని లేచి
ప్రాణనాధునిఁ గొట్టంగ జరుగు లెత్తు!

కెలంగినుంచి కేగివందు భాగిశాస్త్రిగారు మొన్న మనవూరు మామి

డాల మల్లిడయ్యగారింటికివచ్చి మల్లిడయ్యగారి కుమారునికి పిల్లనిచ్చెదమని చెప్పి కట్నమడుగరేమని కర్రదీసికొని మల్లిడయ్యగారి భార్య మల్లమ్మ భర్తమీదపడెనఁట. చూచినవారందఱు పకపకనవ్వినారఁట.

గుణ—అన్నన్నా—ఎంతపనిఁ జేసినది. యీకలి కాలములో గయ్యాళిగంపలు చాలమంది గలరు. అవును. అవును.

తే॥ గీ॥ అకట ! మగవారు పందలై యాడువారి
కెదురుఁ జెప్పలేకను తమ మతమునంతఁ
జంపుకొనుచుండ నింతి పెత్తనంబుచేతఁ
జిక్కి యుండిరి మగవలు కుక్కలైరి.

ఇదంతయు సత్యమే కదా. ఇంక మీరన్న మాటలోఁ దప్పేమున్నది. దానికేమి గాని చివరకేమి చేసినారు.

సుంద—అందు విషయమును నాకేమియుఁ దోఁచుటలేదు. ఊరంతయుఁ గుక్కవలెఁ దిరిగి తిరిగి యింటికి వచ్చుచుండఁగా దారిలో అడావిడి అంకయ్య యను పురుషుడు, మాయింటి కొకసారి రమ్మని చెప్పినాను. అంత అతను సరే యని వెళ్ళినాఁడు.

గుణ—అడావిడి అంకయ్య యెవరు?

సుంద—ఎవరంటావా ! అడావిడి అంకయ్యయనియు, కార్యాల కామయ్యయనియు సీగ్రామములో నిద్దరు బ్రాహ్మణులున్నారు. ఈ చుట్టుపట్ల గ్రామాదులలో నే పెండ్లిజరిగినను వీరివలననే జరుగవలెను. వీరే సమర్థులు. కార్యమునకు సరిగట్టువారింకెవ్వరును లేరు.

గుణ—ఆహా ! మంచిపని చేసినారు వారికిఁ బ్రతివిషయము దెలియును. వారితో నాలోచించి కార్యములు చక్కగాఁ జేయవచ్చును. వారివల్ల మనకుఁ గావలసినంత పనిజరుగును. వెంటనే వివాహము లగు సాధనము చూడండి. మన పెద్దమ్మాయికిఁ బండ్రెండవయేఁడు కూడ వచ్చినది. చిన్నమ్మాయి దానికన్న నొకయేడాది మాత్రమే

చిన్నది. కట్నములనివ్వలేక నింతవఱకు నాలస్యము చేయవలసివచ్చినది. ఈమాసములో ముడిపడని యెడల తప్పక హానిసంభవించును. ఏదమ యమునకు తగ్గవని నానమయమునకుఁ జేయుచుండవలయును. నా మాట వినిపించుకోరు గదా? అయినను నేనేమి చేయఁగలను. ఈపాటికి సుఖముగా నుండెడివారము.

సుంద—ఓసీ! పిచ్చిదానా! బిచ్చిభ్రమపడుచుంటివేమి? ఏమి సుఖము, ఏమిలోకము, అత్తమామలను సాగఁదీసి పంచులకొలఁది కట్నములు క్రింద లాగుచున్నారు.

గుణ—సరే;—ఎంతచేసినను మనము భరింపక తప్పదు. కట్నములకై వెరచిన కార్యములగుట కష్టతరము.

సుంద—సరి, సరి, దీర్ఘాలోచనములో దినములు గూడ గడచును. పొద్దుతిరుగుచున్నది. భోజనమునకుఁ బోవుదము రమ్మా.

(అని నిష్క్రమించును)

(నీలాంబర—కనకాంబ ప్రవేశింతురు)

నీలా—చెల్లెలా! నాయనగారి మాటలను వినుచుంటివా! ఏమయినను సరియే. నేను కట్నమిచ్చిచేసెడి వరునిచే పుస్తెఁగట్టించుకొనను.

శా॥ తల్లిం దండ్రినిఁ గష్టపెట్టి మనకా తల్ నాటిక్షేత్రంబులన్
చెల్లంజేసి వరుండురాడని మదిన్ సిగ్గున్ విసర్జించి కో
భిల్లంగట్నము లియ్యఁ బాడితమ! మా విద్వాంసుఁడుర్ వచ్చినన్
జిల్లింగవ్వరు కట్నమివ్వకటునే శీఘ్రంబు పెండ్లాడరన్.

కన—అక్కా! ఏమనిచెప్పవచ్చును. తల్లిదండ్రుల మాటకు వ్యతిరేకించఁగలమా! తండ్రిగారిష్టప్రకారము మనము చేయవలయును.

నీలా—కాఁబట్టి మనము శుల్కముఁగోరువానిని పెండ్లి యాడవద్దు.

కనకా—చాల బాగున్నది. మంచి యోచనఁ జెప్పితివి.

నీలా—నా ప్రతిజ్ఞ వినుము.

తే॥ గీ॥ గుణముగావలె విద్యార్థి కోవిదుండు
శుల్కమేమియు నడుగంగ నెంతయైనఁ
దలఁప కుండఁ బ్రతిజ్ఞను దాల్చువాని
పెండ్లియాడెద వినుమింక వేలసీవు!

నీమనోభావమేమి ?

కనకా—యథార్థముగాఁ జెప్పుచుంటిని వినుము. శుల్కము కోరువరుని పెండ్లియాడి వానికి నీతిబోధించి లోకంబున దురాచారమును ఖండించెదను.

నీలా—సత్యముగ నట్లు సాగించెదవా?

కనకా—అక్కా! వేఱు నీవడుగవలయునా? చెప్పినమాట యెంతయో! చేసెడికార్యముఁగూడ నంతియే!

(అంకయ్య ప్రవేశించును.)

అంకయ్య—అమ్మాయీ! సుందరశివరావుగారింట్లో నున్నారా!

నీలా—అయ్యా! లోన భోజనము చేయుచున్నారు, కాసింతఁ గూర్చుండుఁడు.

అంక—ఇంకా! భోజనమే నాకి నాయమ్మకడుపు కాలా! ప్రొద్దుననఁగా గనబడ్డారు. పండ్రెండుగంటలకు రమ్మని చెప్పినారు. ఇంకా భోజనము కాలేదు. నేనప్పుడే బజారునకు వెళ్లినాను, కూరలుకొని కోటయ్యకొట్టుదగ్గఱకు వెళ్లి పొడుము కొనుక్కొని స్నానముచేసి, నరయ్య

గారింటికి వెళ్ళి సంభావన దెచ్చుకొని యింటికి వెళ్లి భోజనము చేసి చక్క వచ్చేటప్పటికి దారిలో పిల్లి యెదురుపడగా దిరిగి వెనుకకుఁబోయి కాసేపు కూర్చుండి వచ్చినాను— అవునే అమ్మాయీ! మీరిద్దఱు సుందరశివరావుగారి కుమార్తెలేనా యేమిటి?

నీలా—అవునండీ! నేను పెద్దమ్మాయిని. అదినా చెల్లెలు.

అంక—నీపేరేమి?

నీలా—నాపేరు నీలాంబరి. చెల్లెలిపేరు కనకాంగి.

అంక—బహుచక్కగానున్నాయి పేర్లు. అవుతే! మీరేమి చదువుకుంటున్నారు?

నీలా—నేనాంధ్రమునఁ గొంత పరిశ్రమచేసితిని. ఆంగ్లేయము కొంతవచ్చును.

అంక—మీ చెల్లెలో?

నీలా—సంస్కృతాంధ్రములలో చక్కని ప్రవీణతగలదు.

అంక—ఆలాగునా! అట్లయిన తెలుఁగులో నొకపద్యమును చదివింపుము?

కనకా—మా అక్కయ్యకూడా అన్నిభాషలలో నారితేరినదండి. సంస్కృతాంధ్రాంగ్లేయములు చక్కగవచ్చును. మీదగ్గఱ సిగ్గుచేత చెప్పలేదు.

అంక—సరి! సరి! యింకనేం. నాకడసిగ్గెందుకమ్మా? అవును. కాని నీవొక పద్యమాంధ్రములోఁ జదువుము?

కనకా—మనుచరిత్రములో పద్యము చదివెదను.

మ॥ వనజాక్షీ వినుము వామలూరుతనయుఁ ద్వైపాయనున్ భట్టబా
ణుని భాసున్ భవభూతి భారవి బంధున బిల్హణుం గాళిదా
సుని మాఘున్ శివభద్రు మల్లణకవిం జోరుంమురారిం మయూ
రుని సోమిల్లిని దండిఁ బ్రస్తుతులఁ జేరోఁకొందుఁ వచస్సిద్ధికిన్.

అంక—ఆహా! మహాచక్కని పద్యాం చదివితివమ్మా! నీలాంబరీ! నీవుకూడా! యొక్కపద్యము చదివి శ్రవణానందముఁ జేయుము?

నీలా—నేను భాగవతములోని పద్యముచదివెదను.

మ॥ కలఁడంభోధిఁ గలండుగాలిఁ గలఁడా కాశంబునం గుంభినిం
గలఁడగ్నిందిశలంబగళ్ల నిశలం ఖద్యోతచంద్రాత్మలం
గలఁడోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలిం గవ్యక్తులందంతటం
గలఁడీశుండుగలండు తండ్రి! వెదుకం గానేలయీయాయెడన్.

అంక—ఆహా! ఏమి శ్రావ్యము—బహు సరసముగానున్నది. నీలాంబరీ! తగినవరునిఁ గూర్చెదఁ బెండ్లాడెదవా?

నీలా—విప్రా! శుల్కవిముఖుండగువరునిఁగాని నేనితరునిఁ బెండ్లియాడను.

అంక—అమ్మాయీ! యీరోజులలో శుల్కవిముఖుండగు వరుండు లభింపఁడు. అయినను నాశక్తికొలఁది ప్రయత్నించెదను.

(సుందరశివరావు ప్రవేశించును.)

సుంద—అయ్యా! శాస్త్రిగారూ! మీరు వచ్చి యెంతసేపయినది?

అంక—నేను వచ్చియిరువదినిముషములయినది. భోజనము చేసితిరా?

సుంద—అమ్మాయీ! అమ్మ కనిపెట్టుకొనియున్నది. మీరు వెళ్ళి మీయమ్మనొకసారిపంపుడు.

నీలా—కనకాంబ—మంచిది. (నిష్క్రమింతురు.)

(గుణవతి ప్రవేశించుచున్నది.)

అంక—సుందరశివరావుగారూ! కావలసిన సంబంధము చిక్కనున్నది. మఱొకవిధముగా నాలోచింపవద్దు. కట్నాలుపోయు లేక

కడుపులు కాల్చుకుంటూయున్నారు. కాలమంతయుఁ దారుమారయ్యెను. మా చిన్నతనములో మచ్చుకైనా యీపాడువేషా లెఱుఁగము.

సుంద — ప్రేయసీ! శాస్త్రిగారికి మనకు చాలా స్నేహము కలదు. సాధారణముగ వారెఱుఁగనివా రీపురంబున లేరు.

గుణ — అలాగునా?

అంక — అమ్మా! నన్ను మీరింత బాగుగ నెఱుఁగరు. కాని పంతులుగారికి నాకుఁ జాలా పరిచయముగలదు. ఈమండలములో నెవరికి సంబంధముల విషయములు యాలోచనములు కావలసివచ్చినప్పుడు నన్నుఁ బిలిచి తద్విషయము యోచింతురు. పుట్టినప్పటినుంచియు నే నీపురంబులోనే గాపురంబు.

సుంద — అయ్యా! శాస్త్రిగారూ: అనుకూలమైన సంబంధములు చెప్పండు. నా సంగ తెఱుఁగుదురా! యిప్పటి కిఱువదియేండ్లఁబట్టి అనుకూలమయిన యుద్యోగమునకు హస్తోదకములిచ్చి సంఘదురాచారమును చంపుటకై ప్రయత్నించుచున్నాను. అందులో నేను సుల్కము శూన్యము చేయనెంచి యయ్యాదిదూష్యమనే పట్టుదలవాదములలోఁ జేరినవాఁడను.

అంక — అయ్యా! ఆగండి. నేనొకమనవి చేస్తాను. ఇన్నాళ్ళనుంచి యిప్పటివరకు పాటుపడుతున్నారుకదా! తొలవరయిన యీసంఘదురాచారవిషయమును మానుటకు ప్రయత్నించినారా? మీరు మాన్పింపఁ గలిగినారా! సర్వము బద్ధము — పట్టిపట్టుదల లేకాసి వరశుల్కముమానే వా రొక్కరున్నారైనా లేరు. ఈరోజులలో కట్నములు మానేవారెవరండి! అందుకుదగినట్లుగా —

తే॥ గీ॥ ఆడువారలఁ గన్నందు కైన విధాత
తగినశిక్షను జేయఁగాఁ దలచినట్లు

కానఁ బడుచున్న దిప్పుడే కారణంబు
లేకయున్నను కష్టమే రాకయుండు.

సుంద—శాస్త్రిగారూ!

ఉ॥ ఏమని చెప్పవాఁడ నిఁక నెద్దియుఁ బాయదు పోచకుండినా
నామము వ్యర్థమౌ బడి మందిగృహంబుల కేగినాడ నా
కేమతిపోయె, కుల్యమున కేకరదంచు వచించినారు యిం
కేమిరౌనర్తు భూసురను ధీమణి దుష్టవిధాత వ్రాతకుఁ.

అంక—అక్కడకయింది—మీరుకూడా కాలుగాలిన పిల్లిలాగున దిరిగినారూ! నేచెప్ప లేదటండీ, పెద్దపెద్దలే పేచీలకు సిద్ధపడుతూయున్నారు. పెండ్లికొడుకుల విషయ మంతయు వర్తకవ్యాపారముగా మారినది. పంతులుగారూ! మాటనఁగానే సరికాదు. సంబంధములలో చాలారకములుగలవు. అందువిషయమయి మీరు బాగుగనాలోచింపవలయును. నేనుఁ జెప్పెమాటలు సరిగావినుఁడు. మీకు చదువు, సాంప్రదాయము కావలయునా? సంపత్తు, చక్కఁదనము కావలయునా?

గుణ—నాకు సంపత్తు, చక్కఁదనము కావలయును.

సుంద—నాకుఁ జదువు, సాంప్రదాయము కావలయును.

అంక—అబ్బా! నన్ను చంపినారే! యీనాలుగుయున్న వానిని నేను కాదు. నన్నుఁ బుట్టించిన యీశ్వరునికిఁ గూడ తీసికొనివచ్చుట తగదుగాదు. ఎందుచేతనంటారా! ఘోరములు చేసికొని యుండేవానికి కాని చదువురాదు. సంపత్తుయున్నవానికి చక్కఁదనమే కాని చదువురాదు. ఈనాలుగూయుండడము బహుకష్టతరము.

గుణ—నాకు ముఖ్యముగా చక్కఁదనము, సంపత్తుగావలయునండి:

అంక — అటులయితే! లోభిగారయ్యలింగయ్యగారి కొడుకున్నాడు. సాలునకు నాలుగువేలరూపాయలు మాన్యాలమీద వచ్చును. రెండువేలరూపాయలు యింటియద్దెలమీదవచ్చును.

గుణ — చక్కదనమో?

అంక — చక్కదనములో చాలినవాడు మనయూరిలో లేడు.

గుణ — అటులయితే యీసంబంధము చూడండి.

సుంద — మరియొకటి సెలవీయుడు.

అంక — చదువు సాంప్రదాయము కావలెనంటే శాకరవర్తి కామయ్యగారి కుమారుడుంట. ఘూబగుంటవారింటిలో వారాలుచేసికొంటూ చదువుకుంటూ యున్నాడు. సాలుకు మూడువందలాదాయముబడి. యే చదువుతూయున్నాడు. సాంప్రదాయము చక్కనిది.

గుణ — అబ్బా! ఇదివద్దండీ. మొదటిసంబంధమే కుదర్చండి.

సుందర — దాని యిష్టప్రకారం చేయించండీ.

అంక — కట్నములో కాస్తపట్టుగలదు వాండ్రకు.

సుందర — ఎంత?

అంక — అయిదువేలు రూపాయిలు అదికాకుండ లాంఛనములు.

సుందర — ఈసంబంధము యోచింపుడు.

గుణ — నాయభీష్టముకూడ నంతియే.

సుందర — శాస్త్రిగారూ! మీరు కనుక్కొనియిదిస్థిరపరుచండు. మీమేలు మఱచిపోను. నాయందు దయవహించి ముంచండి.

అంక — ఆహా! ఎంతమాట సెలవిచ్చితిరి. వరాయులమూ ఏమిటి. కావలసినవారిలో కాస్త యుపకారము చేయలేమా యేమిటి? ఇంతకు వారియభిప్రాయమును కనుగొనవలసి యున్నదికదా?

గుణ—ఏలాగునైన! స్థిరపడినమాటేనండి. మాయింటనుచక్క
గా ఆస చేయవలయును.

అంక—తొందరపడినకార్యమౌనా? అయ్యో! నాకు సెలవా
సంగుడు. మీతో రేపీసంగతంతయు చెప్తాను. శకునములో శాస్త్రమిట
యినా అటయినా చూస్తాను.

సుందర—దయయుంచుడు. మీమాట కెదురాడము. త్వరగా
దయచేయుడు.

అంక—చిత్తము. నేను పోయెదను.

(అందరు నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.






## ద్వితీయాంకము

1వ రంగము:—లోభిశాయ్య లింగయ్యగారి గృహము

లింగ—(ప్రవేశించి)

మ॥ ధనమే ప్రాణము, ద్రవ్యమే సుఖము, సౌందర్యంబు గేహంబులున్
ధనమే, సద్గతి ద్రవ్యమే యశము విద్యా మాన్యముల్ దేహమున్
ధనమే, దాతలచుట్టమున్ గురువుయాగ్ దారామహీపుత్త్రులున్
ధనమున్ లేని మనుష్యజన్మము వృథ ధాత్రీతలంబందునన్.

ఆహా! ఇట్టిధనము మాన్యులు మట్టిపాలు చేయుచుండిరికదా? ధనము సమస్తమూలకారణము ధనమవశ్యకమయినది. ధనము లేనిచో తనువు చిల్లిగవ్వకు చెల్లదు. ధనమే దాంపత్యవిశేషము గూర్చును. ధనమువల్లనే ధరాతలంబు గ్రాలుచున్నది. ధనమువల్లనే మహాపుణ్యస్థలంబులు మంజులత వహించుచున్నవి. ధనమున్నచోటకుఁ బెక్కుమంది విచ్చేయుదురు. ధనవంతునికడకు సర్వబంధుజనము సమకూడును. స్నేహితులు చీమలవలె చేరుకొందురు. ధనములేనివానికి తలనైనఁ జూపరుకదా! ఎట్టిమహాత్ముండైనను ధరాతలంబున ద్రవ్యముకొఱకై తన తనువును ధారవోయును.

తే॥ గీ॥ ధనముకై విధాత సృజించె దారసుతుల
ధనముకై గృహంబులఁ గూర్చె ధాత్రియందు
ధనము ముఖ్యసాధనమని దైవమిపుడు
తలఁచుచున్నాఁడు మాయభూతలమునందు.

కానిదబ్బును కారణము లేనిదే పోనీయకూడదు.

గీ॥ వడ్డివడ్డీల కుంజెంచు ఘుష్టనతము
సౌధరాజంబులందు వాసంబు చేయు
మాందివారలనంట గ్రహించుచుండ
నిట్టిదరిద్రంబు మాన్యులు దట్టనేల.

ప్రతివిషయమునకంటె ధనమందెక్కువ జాగ్రత్తవహించవలయును స్వాంతవ్యవహారములలో బహు జాగరూకతతో బనిచేయవలయును. ప్రాణమయినను పోనీయవచ్చునుగాని ధనమాత్రము పోనీయకూడదు. వాటమెఱిఁగి వడ్డికియ్యవలయును. ధనమె ప్రధానభూతముగా ప్రజలు చూడవలయునుగాని లేకమొకల దారిద్ర్యదేవత తలమీఁద నాసనముగానుండును. వెఱ్ఱిమనుష్యులు వేయివిధంబులుగా ద్రవ్యము వ్యయము చేయుచున్నారు.

గీ॥ ఆలయంబులు కూపంబు లందలములు
గట్టమని చెప్పుదురు కలి కాలమందు
సత్రములు యజ్ఞములు నేఁడు సల్పనిపల
ద్రవ్యము నశింపజేసెడు దారులందు.

ఇటువంటి భాగ్యంబును యోగ్యతలేక బాడుచేయుచున్నారుగదా?

శా॥ మళ్ళున్ మాన్యములన్ గృహంబులను యజ్ఞంబాదిపుణ్యంబుకై
గుళ్ళున్ గోపురమాల్ ఫలంబులనిన గ్రుంబాసి కట్టించఁగా

ఇది కార్తీకమాసమని తెలుసునా? వనసంతర్పణభోజనములకువందలు కొలంది కేక వేస్తారు. రవంతసేపూరకుండినిద్రా రాజేస్తే నయమనినానా విధముల చెప్పినాను.

రామ—పండ్రెండు గంటలు కావచ్చినవి. ఇంకా యెవరు వస్తారండి. కడుపులో కాలుచున్నదని అబ్బాయిగారు అడావిడిగా తిరుగుచున్నారు.

లింగ—నీ మొగము లాగేయున్నది. కుర్రముండాకొడుకు మాటలకు లెఖ్ఖచేయవద్దని అనేకపర్యాయములు చెప్పినాను.

రామ—నాకేమండి! ఇంకా నాలుగుగంటలదాకా కూర్చోమంటే కూర్చుంటాను. కాఫీహోటలులో కడుపునిండా మెక్కినాను.

లింగ—ఆవాసనమాత్రం అబ్బాయికి చూపకుసుమీ—పాడవగలడు.

రామ—సరే! నేను ఆలాగున వెళ్ళి మళ్లీ వస్తాను.

లింగ—నిన్నటి వంటసరుకు జమాఖర్చు చెప్పేవు కావు.

రామ—ఆలాగయితే వినండి చెపుతాను. వంటపుల్లలు వాల్గింటికి పుల్లస్సరవున్నది. మిరపకాయలు కొంపుకెపదియున్నవి. చింతపండు ఈపూటకి సరిపోతుంది. బియ్యము కేయికి గుప్పెడున్నవి. నేయి రెండుగరిటెలున్నది.

లింగ—అంత నెయ్యి ఏమి చేశావురా!

రామ—పంతులుగారూ! మీరుమాటిమాటికి వాకేయంటే పూరుకొనే వాడను కాను. మీగొప్పమీది. నాగొప్పనాది. ఇల్లాగయితే నేనీయింటిలో నుండేదిలేదు.

లింగ—ఏమిరా! యింతకోపమువస్తే యేలాగురా? ఇంట్లోవున్నాక మాటలుతప్పవుకదా. అన్నట్లు అమ్మగారిని వంటవిషయము అడిగినావా?

రామ—అమ్మగారు. బంగాళదుంపకూర, పప్పు, దోసకాయ పచ్చడి, పులుసువండుమన్నారు.

లింగ—ఈలాగయితే కాపురం గంగలో కలపవలసిందే. అంటినను నిన్ను నాయాజ్ఞలేనిదే అమ్మగారితో మాటాడవద్దని యెన్ని పర్యాయములు చెప్పను.

రామ—పలకరిస్తేనే పాపవుతారా యేమిటండి. మీయింట్లో నున్నప్పుడు మీవారితో మాటలాడ వలయునుకదా?

లింగ—ఇదిగో! నామాట కభ్యంతరము పల్కవద్దు. నా యాజ్ఞ ప్రకారం మసలుతేనె నాయింట నుందువు. లేదా లేవఁగొట్టెదను.

రామ—నాకు మీయింటి అనవసరమయిన తగాయిదాలు వద్దు. పొమ్మనకుండా నే పోతాను. రామారావుగారింట నంటమనిషి లేదని తహతహలాడుచున్నారు. నన్ను రమ్మనియారికే క్రిందమీదబడి బ్రతిమాలుచున్నారు. ఇరువయి రూపాయలు జీతం యిస్తారంట. నా వలసిన పదఁపాయముండ సాగుతాయి కదా?

లింగ—వ్రాసికే పెనుగులోనకి పద్దుప్రకారం సామగ్రి పుచ్చుకొని వంటచేయుము. ఏదో యాదాలోకంగా అన్నమాటలు. ఇంత మాత్రమునకే కోపగించవలెనా?

రామ—బాబుగారూ! అమ్మగారి దగ్గఱకువెళ్ళి పద్దుప్రకారం సామానుపుచ్చుకుంటాను. తాళముచేతులు పంపిస్తారా?

(అని వెళ్ళిపోవును)

లింగ—రామయ్యా! యిటోకసారి రమ్ము. అమ్మగారిని అనవసరముగా నడగబోకు. ఆమెకు కోపము వస్తుంది. పద్దుప్రకారం నేనేసామానులిస్తాను. బియ్యమెన్ని కావలయును, చెప్పుము?

రామ—పాతపద్దు ప్రకారం మానెడు.

లింగ—మిరపకాయ లెన్ని?

రామ—మిరపకాయలు మూడు.

లింగ—పెసరకట్టు?

రామ—గిద్దెడు.

లింగ—వంకాయ లెన్ని కావలయును?

రామ—వంకాయలు వద్దట. బంగాళాదుంపలివ్వండి.

లింగ—బంగాళాదుంపలు బజారులో లేవని చెప్పుచున్నారు. కాబట్టి వంకాయలు కాలేసి పచ్చడిచేయి.

రామ—సరే.

లింగ—చింతపండెంత?

రామ—చీటిప్రకారం చిన్నంయెత్తు.

లింగ—నెయ్యి, నూనె, నాల్గుతులాలు విస్తళ్లు బాదంచెట్టు ఆకులు కుట్టివేయి,

రామ—వంట చెఱుకు వద్దండి?

లింగ—దొడ్డిలోనున్న పెడుసుకర్రలు మంటబెట్టు. సరే నీవు త్వరగా వెళ్లి వంటచేయుము. స్నానంచేసి చక్కా వస్తాను.

రామ—చిత్తంగారండి (అని నిష్క్రమించును.)

లింగ—ఇప్పటికి యీశని వదలినది. ఈముండాకొడుకుతో వేగలేకుండా యున్నాను. ఆలేమావిగున్నతో సన్నముగా మాటాడుతాడు. వద్దని మొత్తుకున్నా వినడు. ఇంతకు వీని ననవలసిన పనిలేదులే? ఇంతకు నాకర్మమిట్లుండగా యొకరిని అనవలసిన పనిలేదు. రాత్రింబవళ్ళు చముటకారేటట్లుగా గష్టపడి కాసి సంపాదించే సర్వఖర్చేకాని నిలవలేదు కదా ?

(అంకయ్యగారు ప్రవేశము)

అంక—(తనలో) ఏదో! బొల్లికల్లి మాటలు మాటలాడి అటు చిమ్మట అసలు సంగతిలో దంపుతే కాని మాటాడను. (ప్రకాశముగా) లింగయ్యగారూ! ఏమి చేయుచున్నారు.

లింగ—అయ్యా! ఇంట్లో యీదుతూ వున్నాను. "సంసారం సాగరం" అనివూరికే అన్నారా బాబూ! సంసారంతో సాగలేక నేకదా నాలు గారువేలరూపాయిలు వచ్చుచున్నను సంవత్సరంచివరకు సంచి రూపాయిలప్పోకదా! శాస్త్రిగారూ! మీరు వచ్చిన పనియేమిటి?

అంక—ఒక ఆసామీకి తనఖా కమ్మమీద పదిహేను వేలరూపాయిలు కావలసి వచ్చినవి.

లింగ—అంకయ్యా! ఈరోజులలో వ్యవహారములు చూస్తూ యున్నావా? అందరు అప్పులపాలై బయలుదేరుతూ వున్నారు. వడ్డీలు వాటంగాలంది పుచ్చుకుంటూ వున్నాను. అందులో నీరోజులలో గ్రామాలు తెల్పదుకదా! రూపాయి ఇట్టిదరణాలు నా॥ పదుకడితే తీసి కానిరా? లేకపోతే శీఘ్రంగా లేపచ్చును. ఏదెట్లయినను వడ్డీనికరంగా దీసికోబడును.

అంక—దానికేమిగాని తనఖా అన్న తనఖాగాదు. తాతలనాటి బకట్టోరకం అయిన చెఱకుతోటలు పంపులు, పదిహేనుయకరములు భూమి. అప్పుతీర్చే టట్లుగన బడదు. యకరం రెండువేల రూపాయిలు చేస్తుంది. వడ్డీ ఒకరూపాయి వేయించండి, నామాట విన్నారా నాకల్లో కంలోకి తీసికొని పెడతాను. నాక్యమైనవద్దు. నావల్ల మీకు వచ్చినది కాని లేకపోతే యింకొకరికి పోనిస్తే వద్దు.

లింగ—సరే! కాగ్దు తెప్పించండి. చూచి సంగతి తా సావకాశంగా చెప్తాను.

అంక — అట్లయితే సెలవు తీసికొంటాను (అని లేవబోవును) యీయేడు అబ్బాయికి వివాహము చేస్తారా?

లింగ — అనుకూలమయిన అత్తవారు వస్తేగాని చేయను.

అంక — అనుకూలమయిన సంబంధము. సుక్షేత్రము. కోటాన కోట్లుబోసిన దొరకదు. మొట్లకానస్యాను అయినాడట. సాలుకు ఆరు వేల రూపాయలు వస్తాయి. అత్తగారింట స్వర్గముబొందవచ్చును. అన్ని విధాల హాయిగా నుంటుందని మీఅబ్బాయిని గురించిన్నీ మీ సాంప్రదాయము గురించిన్నీ యిదివరలో నొకరితో జెప్పినాను. ఆసంబంధము మీఅబ్బాయికి చేస్తే బాగుంటుంది. నేను మాటలు వారితో జెప్పినక్కు యపరిమితానందము బొందినారు.

లింగ — సంబంధ మెక్కడిది?

అంక — ఎఱుగరా! కోనాపుదగ శివరావుగారు. ఆయన పెద్దకుమార్తెకు పదకొండు వత్సరములు గాటినవి. చక్కని ముక్కు. సుశీలవతి. అన్ని విధాల అబ్బాయికి అనుకూలించును.

లింగ — అంకయ్యగారూ! చక్కదనం కొరుక్కుతింటామా యేమిటండి! కాని సుందర శివరావుగారికి యేపాటి వసతి?

అంక — సాలుకు రెండువేల రూపాయిలు వచ్చును. మాతామహుఁడు పదిహేనువందల రూపాయిలువచ్చు మాన్యాలువ్రాసి యిచ్చినాఁడు.

లింగ — దీనికేమిగాని కట్నమేపాటి?

అంక — పదిహేనువందల రూపాయిలకు లోటులేదు.

లింగ — (పెదవిచప్పరించి) ఈశాస్త్ర బేరమునకు నేను కమీషను కావాలంటావు. తీసికొని వచ్చేవి చిల్లర బేరములు.

అంక — ఎంత కట్నమిప్పించవలయును?

లింగ — అయిదువేల రూపాయిల లాభసాటిమాట. దీనికి ఒప్పుద లయితే తరువాయి సంగతి చెప్పుతాను.

అంక — నూటికి పదిరూపాయలు చొప్పున కమీషను పద్దుక డాలి. దానికయిన వారిష్టం మీయిష్టం.

లింగ — ( నెలో దిస్తూ ) కట్నం సంగతది కదా ! తరువాతసంగతులివి. వెండిచెంబులు కంచం పీతాంబరములు పింగాణీ సామాను వాచీగొలుసు చేతిగొలుసు స్టూవాచీ అల్కపాన్పు వయిన ఆరువందలు వియ్యపురాలికి వేయిరూపాయిలు లాంఛనములు. అవి వివరంగాఁ జెప్పనక్కరలేదు. అస్సరకాలు సామానులు విధాయకంగా వియ్యపురాలికి ముట్ట జెప్పవలయును,

అంక — ఏమయ్యా ! ఎంత వింతగా జెప్పితివయ్యా ! కాని కట్నములోను కొల్పుడా కవద్దు. అయిదువేలు కాదు. పదివేలిప్పిస్తాను. కాని కమీషను మఱవద్దు.

లింగ — అంకయ్యావంతులూ! అదిగో ఇదిగో యని కాలయాపనచేయక ఏదోమాట పట్టి పాచెవిలోఁ బడవేయవలయును. కమీషనులో గట్టాక్కిడదు. కావలసినంత యిప్పిస్తాను. వ్యాపారం మాత్రం చక్కగా జూడవలయును. స్వంతవ్యాపారం క్రింద జక్కపెట్టవలయును.

అంక — ఇందులో నావడిలో వంతావడదు. తినేదంతా మీరు మీఅబ్బాయిగారున్నూ.

లింగ — రేపు ముందువెళ్ళి వారిసక్కదకుదీసికొనిరావలయును.

అంక — సాయంత్రానికు జక్కావస్తాను.

(అని నిష్క్రమించును.)



## 2 వ రంగము.

---

(లింగయ్య-ప్రవేశము-గృహము)

లింగ—(తనలో) మునపటివానికి వలెనె భార్య ప్రాణసంకట మన్నారు. ఎంతకష్టమువచ్చినా కూతురికి వివాహము మాత్రంవద్దు. నా లేమావిగున్న లేనిపోయిన మాటలు వెట్టికయ్యమునకు గాలుదువ్వుతుంది. దీనితోఁ బోరుపడలేకుండా యున్నాను.

ఉ॥ ముద్దుగ మాటలాడినను । మూతి బిగించు కరంబుతోడన
న్గ్రిద్దును దూరమైనిలుచు । గొంతుక నెత్తిన దిట్టుచుండు నే
వద్దని చెప్పు కార్యములు । వ్యర్థముగా నొనరించుచుండు నా
హద్దుమొకింతలే దెటుల । హా! విధి నేనిఁక నేమి సేయుదుఁ.

అదిగో నాభార్య ప్రవేశించుచున్నది.

[ప్రవేశము భద్రావతి]

భద్రా—(తనలో) ఆహా! యీకాలములో నుద్వాహములు బహుచిత్రముగా నున్నవి.

తే. గీ. పండ్లునగమూడె నేటిది । యొండ్లువిండఁ
దలనరసి కండ్లుచత్వార । తత్వమయ్యె
నమము వంగ శరీరంబు । చూడ చెమట
వాసనల్ వానికిఁ బెండ్లి । వాంఛగలదు.

ఇదంతయు నాభర్తకు చెందియున్నది. వీనితో మాటాడుటయే నాకసహ్యము. అయిననుతప్పదుకదా! (ప్రకాశముగా) ఇంకా మీరు నలీలాగేయుంటారు కాబోలు. తిండితిప్పలు లేవుకద.

లింగ—(తనలో) ఆహా! నాభార్య నాకలోకములోనైనా లేదు; ఏమాహోయోగము;

తే. గీ. కొమ్మగాదిది బంగారు బొమ్మగాని
కన్నగాదిది లేమావి గున్నగాని
కల్కిగాదిది చిలుకల కొల్కిగాని
పాత్రమయ్యెను నాభాగ్య వశముచేత.

భద్రా—నామాటంటే పెడచెవిని బెడతారు కదా? నగలు నాకేములు చేయించరుకదా? నామాటకు సమాధానము చెప్పరే.

లింగ—ఆకలి అంతగా లేదు, అందుచేత పాలస్యం చేశాను.

భద్రా—దాని కేమిగాని నాచీరలు మాటేమి చెప్పేరు?

లింగ—(చిఱునవ్వులు నవ్వుచు) ఇదిగో, నామాటవిను. అయిదురకములు చీరలు అరనిమిషములో వస్తాయి.

భద్రా—నా ముఖం లాగేయున్నది. సంవత్సరంమట్టి పోరుతూయున్నా కాని ఒక చీరతీసికొనిరాలేకపోతిరికదా?

లింగ—ఇదిగో నామాటవినుము. నేను కొంటానని నీజన్మలో ననుకో వద్దు;

భద్రా—మీరు కొనకపోతే అట్టేవుంటుందా యేమిటి:

లింగ—అట్టేవుండక నియబ్బయెవడయినా తీసికొనివచ్చి నీకిస్తాయున్నాడా యేమిటి.

భద్రా—మీరు పూరకే అబ్బాగిబ్బాయంటే మాత్రం వచ్చేదిలేదు; అవును, కాని అయిదు చీరలు అన్నారేమిటి?

లింగ—రేపు అబ్బాయి వివాహకాలమందు అయిదు చీరలు అయిదురోజులూ పెట్టరే!

భద్రా—(మూతివిరచి) చాలు, చాలు, సంబరాలు. సంవత్స

రాచుంచి నల్పుచున్నగాని సంతోషమునకైనా ఒకచీరకొనలేదు; ఇంకామీఅరబ్బాయికి పెండ్లి చేయడము నాకావేధవలె పెట్టడమువా! ఆ! బాగానేయుంటుంది; ఆపిల్ల మీయింట బాగానే సుఖపడుతుంది; దిక్కులేని వారెవరో మీకివ్వాలిగాని దిక్కున్నవారు మాత్రం మన అబ్బాయికి పిల్లను మాత్రం యివ్వరు; నేను శుభ్రమైన కోకకట్టుకొని మెఱుంగనా కదా? ధనమున్నందుకు దనువు సౌఖ్యముందవలయును; తగలపెట్టిన తరువాత డబ్బు వెంటరాదు కదా?

చ॥ బ్రతికిన నాల్గునాళ్లు సుఖ జీవనమునందు చరించి బిడ్డలన్
అతివినయంబుగా బెనిచి యందఱియందు దయాంతరంగుడై
సతిని సుఖంబులందు సరసంబుగ జూచి మెలంగువాఁడె స్వ
ర్గతిని మహామహులు దనుచున్ జెప్పెద రిప్పుడు ప్రాణనాయకా!

లింగ—బాగానేయున్నది; అర్థంశుభంలేకుండా వాగుతావు కదా? శుభసూచకాలు మాటలాడుతుంటే కోపాలపెట్టుతావుకదా?

భద్రి—మీరిల్లామాటాడితే నేనిబాధపడలేను; నాపుట్టింటికి నేను పోతాను;

లింగ—వెఱ్ఱిముగవా! యీమాత్రమునకే యింతవంతపడాలటే. నామాటవినుము. నాణ్యమైనచీరలుకొంటాను. పెండ్లివారి సాయంత్రం చక్కా వస్తారట. సంబంధము స్థిరపరుస్తారు. నీకు కావలసినలాంఛనములు జాగ్రత్తగా ఫయిసలు చేస్తాను. నూటికిబదిరూపాయిలు తక్కువకానీయను; ఇందులో నాకేయనక్కఱలేదు. నీయిష్టానుసారము చేసికొనవచ్చును.

భద్రి—ఆ! మాటమాత్రం అతిసులభంగా వస్తుంది. ధనము మాత్రం దమ్మిడివ్వరుకదా?

లింగ—ఓసీ! పిచ్చినానా! పోటుకుండలాగున వాగక నామాటరవంత వినుము,

తే॥ గీ॥ ధనము ముఖ్యంబు గౌరవ దాయకంబు
ధనము పుణ్యంబు దైవంబు అనవరతము
ధనము లేనివాని బ్రతుకు ధాత్రియందు
చులకనౌగాదె నరులకుఁ దలంచిచూడ.

ధర్మా—ఆ! మీదగ్గఱ ధనముండు టెంతో యగౌరవముగా కనబడుచున్నది మీవద్దధనము నపుంసకుని రంభయు నొకటి. దాన ధర్మములు లేకఁబోయినా కాధనము తగులబెట్టనా? సరి, సరి, సాయంత్ర మగుచున్నది. నేనులోనకుఁ బోయి పనిచేసికొనవలయును. మాటలతోఁ గాలక్షేపముఁ జేయుటమంచిపనికాదు.

(అని నిష్క్రమించును.)

లింగ—అసే! దీనితల్లిముండా మొయ్య! ఎంత బెడసరికొట్టుగా మాట్లాడినదీ! ముసలి మొగుడంటే యీకాలములో మొంత్రెబుద్ధి ! కాని ముసలివానికి పడుచుపెండ్లాము జన్మజన్మాలకు వద్దు, ఈపెండ్లి నేనెందుకు చేసికొంటినా! యనిశంకించుచుంటిని.

తే॥ గీ॥ గాలినొక మూటలోఁ బెట్టి కట్టవచ్చు
అగ్ని నఱచేతిలో బెట్టి యాడవచ్చు
గాని పడుచుపెండ్లాము ని క్కాలమందు
లోఁగదీయఁగా లేదు యా లోభియెపుడు.

(తెరవ్రాలును)






# తృతీయాంకము.

## మొదటిరంగము — రాజవీధి.

ప్రవేశము — కామయ్య, అంకయ్య.

అంక — ఏమిరా! కామయ్యా! కార్యాలవిషయము కాస్తయినఁ దలవవుగదా? ఈమాఘంలో ముహూర్తములు దాటాయంటే చొప్ప గడ్డి తినవలసినదే. వచ్చేది మాఘంగదా!

కామ — శాస్త్రీ! కాళ్ళు చిల్లులుపడేలాగున తిరిగినాను. క బుర్లుపంపడమే కాని, కానిడబ్బు యిచ్చేవాఁడు లేడు.

అంక — ఓరిగంటివారింటిలో జరిగిన వివాహమునకు నీవుంటివా? ఆడబ్బు మెవ్వరిదగ్గఱున్నది?

కామ — అదే! నీవద్దనున్న పాడుబుద్ధి, దబ్బోదబ్బో యని యేడుస్తావు. కాని చెమటూడ్చి సంపాదించుకొనుమన్న మాటలేదు.

అంక — సరి, సరి, చల్లగా సంగతిచెప్పేసరికి దెబ్బలాటకు సిద్ధము. అన్నట్లు చెప్పుటమఱచితిని. కోకాల సుందరశివరావుగారి పెద్దమ్మాయిని లోభికాయ్య లింగయ్యగారి అబ్బాయి కిచ్చుటకు రాం

లింగ—చాలేవయ్యా! కురుపు నలిపినట్లు నల్పుతున్నావు. చక్కదనం మాకెందుకయ్యా! కొరుక్కొని తింటామా యేమిటి? ఇష్టమయినట్లయితే నా సలహాప్రకారము చేయండి. ఆరువేలరూపాయిల దొక లెక్కయా? ఆపాటి పాకయ్యశాస్త్రులుగారు పదివేలరూపాయిలిస్తానన్నారు అందుకింకా యింటిదాని కనుమానంగానున్నది.

అంక—(సుందరశివరావుతో) మనకు దరిద్రకొట్టుముండాకొడుకు దాపురించినాడు. ఏలినాటిశని మనకెన్నడుకు వదలనన్నట్లు వీడు వదిలేటట్లు కనబడుటలేదు వీడేదియో సంబంధము తీసికొని వచ్చినట్లున్నాడు.

సుంద—నేను నీతో నింతకు ముందే గట్టిగాఁ జెప్పినాను. కాలమతిక్రమించితే కార్యం లేదనికూడ చెప్పినా విన్నావు కావు కదా?

అంక—ఇప్పుడుమాత్రము మేమి మునిగిపోయినది. నేను నిన్న సాయంత్రమే లింగయ్యగారితోఁ గట్టిగా మాట్లాడి వచ్చినాను. అయితే ఖజానామాత్రం యివ్వలేదు (లింగయ్యతో) బాబూ! లింగయ్యగారూ! నిన్నమాకు మాటిచ్చితిరిగదా! యీవేళ యీకుబేరము లేమిటి?

లింగ—అవును! నేను జెప్పిన మాట వాస్తవమే. సంబంధములతోటి సాగలేకుండాయున్నాను. వీరు రెండుసంవత్సరముల క్రిందటనే చెప్పినారు. కాని కాలదోషం బట్టినది నిన్నటిప్రకారం ఫయిసలు చేయుంచినారా యేమిటి?

కామ—అయ్యా! నన్నువిడచిపెట్టి ఇంకొక పడవలో దిగుట భావ్యము కాదు. ఎనిమిదివేల రూపాయిలకు స్థిరపరచండి.

లింగ—లాంఛనములో?

రామ—అన్నియు సంతాలోనివే!

అంక—(సుందరశివరావుగారితో) చూచితిరా ఏమి మొండితనము. కాని మీరు పని పట్టవలెను. సంబంధము మాత్రము పోనీయగూడదు. (లింగయ్యతో) బాబూ! అయిన నూవయిదువందలు.

రామ—ఆ అయిదువందలు మేమే కట్టుకొంటాము.

సుంద—(అంకయ్యతో) పెండ్లికుమారుని ఒకసారి నావిటిలోనికి తీసికొని రమ్మనండి.

అంక—లింగయ్యగారూ! అబ్బాయి యేమి చేస్తూయున్నాడు. ఒకతూరి పిలిపించండి.

లింగ—(లోపలకు ముఖము త్రిప్పి) అబ్బాయీ! బసవయ్యశాస్త్రీ! నావిడిలోనికొకసారిరమ్ము (అని పిలుచును)

(బసవయ్యశాస్త్రి ప్రవేశించును.)

బస—నాన్నగారూ! నన్నెందుకుబిలుస్తా.

లింగ—నిన్ను మామగారు చూచుటకు బిలిపించినారు. యీలాకూర్చుండుము.

బస—(కూర్చుండును)

రామ—లింగయ్యగారూ! ఏదో! ఒకమాటమీద బేరం ఫయిసలు చేయించండి?

లింగ—నామాట వింటారా బాబూ!

అంక—ఆలాగున అనకండి, తొమ్మిదివేలరూపాయిలు మా సుందరశివరావుగారు కట్టుకుంటారు. అటుపిమ్మట మీయిష్టము.

రామ—లింగయ్యగారూ! ఆరూపాయిలు మా ఆసామియే యిస్తాడు లెండి. మాకుఁ దిరము చేయించండి.

అంక—రామయ్యా! నీవీలాగున కార్యానకుఅడ్డము తగలడము శ్రేయము కాదు

కామ—నాకిష్టమే ! కాని మాయాజమాని వుత్తర్వు ప్రకారము నడుస్తాను.

అంక—సరే! నీవుండిలేసమేమిటో చూస్తాను. రా వెంత వరకు రాగలవో ? మాతరపు పాట తొమ్మిదివేల అయిదు వందల రూపాయలు.

లింగ—సరే! బాగానేయున్నది. కామయ్యా! పైకిక్రింద స్థిరపడుచున్నాను.

కామ—అలాగున చెప్పకండి. మాయాజమాని ఆర్డరు అంత వరకే. తరువాత కనుక్కొని వచ్చేదాకా ఆగండి.

అంక—ఇంకేమేముందను, యీలాగునయితే మాయజమాని కిష్టమే లేదు.

కామ—ఏమయితేఅయింది. నేనే అసామ్మీ యిచ్చెదను. తరువాత వారితో మాట్లాడుతాను.

అంక—(సుందర శివరావుగారితో) అయ్యా ! మనవిచేస్తాను. యీలా గొక సారి రండి (అని లేచి) ఈముండాకొడుకు వది లేటట్లు లేదు. సంబంధము చక్కనిది. తరుణం దాటితే సందర్భము కాదు, నామాటవిని పదివేల రూపాయిలకు ఖాయపరుస్తాను.

సుంద—సరే కానియ్యండి (ఇరువురు కూర్చుందురు)

లింగ—నీమాటేమిటో ఖరాగా చెప్పు. చీకటి పడవచ్చినది. నేనుండేది లేదు. దూడ మడుకు గావలసినంత వ్యవహారము.

బసవ—(తనలో ముందుకువచ్చి) ఆహా ! ఏమిటీవింత ! నేనెన్నఁడు విని యెఱుఁగ. కనియెఱుఁగ.

తే. గీ. నడిబజారులో బట్టలం కే బాడుకరణి
సంతలో బశువుల నమ్ము కే చందమునను

వేలమును వేయుచున్నారు కే పెండ్లికొడుకు
నిచ్చు దక్కట నేనేను కే చెప్పగలను.

(దుఃఖముగా) నాన్నగారూ! నాకు బడివేళ అతిక్రమించుచున్నది. నేఁ బోవలయును.

అంక—అబ్బాయీ! రాత్రిపూట బడి యేమిటి?

బసవ—పరీక్షలు దగ్గఱగా నున్నవని, పాఠములు కాక నైటు క్లాసులు పెట్టినారు.

అంక—ఒక్క క్షణము కూర్చుని తరువాత వెళ్లవచ్చును.

లింగ—అవునురా! ఈగొడవ ఫయిసలు కానిమ్ము. తరువాత పోదువుగాని.

అంక—బాబూ! యింక అనవసరముగ గొడవలెందుకు, నామాట వినండి. పదివేలు రూపాయిలు కట్నము మాసుందర శివరావుగా రిచ్చెదరు. స్థిరపఱచండి.

కామ—ఇఁక మాకిష్టము లేదు. మీయిష్టానుసారముగాఁ జేసికొనుఁడు

అంక—సుందర శివరావుగారూ! కొంతసొమ్ము అడ్వాన్సుగా నిచ్చి కాస్త రశీదుముక్క పుచ్చుకొండి. ఆలస్యం అనవసరముగాఁ జేయకండి.

సుంద—ఇదిగో నూరు రూపాయల నోటు.

అంక—బాబూ లింగయ్యగారూ! సొమ్ముపుచ్చుకొని కాస్త రశీదుముక్క మావారి కిప్పించండి.

లింగ—(నోటుపుచ్చుకొని) అంకయ్యా! నీవు వ్రాసియిస్తే నేను వ్రాలు చేసి యిస్తాను. త్వరగా కానిమ్ము.

అంక—(కాగితం కలంపుచ్చుకొని వ్రాయుచుండును)

లింగ—బావగారూ! లాంఛనములలో లావాదీవీలు లేకుండా జరిపుచ్చాలి. రివాజు ప్రకారం అన్నియు జరుగవలయును. మళ్లీమళ్లీ, మనలో మనకు పేచీలు రాకిరాదు. సొమ్మంతా వివాహమునకు ముందుగాఁ బదిరోజులలోఁ బంపించవలయును.

సుంద—మీయిష్టానుసారముగా సాగిస్తాము. బంధుత్వములో తేడా లెందుకుంటాయండీ!

అంక—లింగయ్యగారూ: వ్రాసితిని సంతకంచేయండి (అని కాగితమిచ్చును. లింగయ్య వ్రాలుచేసి తిరిగి కాగితము సుందర శివరావుగారికి యిచ్చును) బాబూ! సుందర శివరావుగారూ! వయికొక సారి చదివి వినిపించండి.

సుందర—(కాగితము విప్పి) "మహారాజ శ్రీ శ్రీకాల సుందర శివరావు బావగారికి వియ్యంకుఁడు లోభికొయ్య లింగయ్యవ్రాసి యిచ్చిన వుత్తరము. ఈరోజున మా అబ్బాయికి మీ పెద్దమ్మాయి సీలాంబనిచ్చి పెండ్లిచేసికొనుటకు నిశ్చయించుకొని తాంబూలములు పుచ్చుకొన్నాము. సదరు పెండ్లికుమారునకుఁ బదివేల రూప్యములు కట్నమిచ్చుటకున్నూ, వియ్యపురాలి లాంఛనములు యావత్తు రివాజు ప్రకారం యిచ్చుటకూ నిర్ణయించుకొని అందుకుగాను మీవద్ద నూరురూపాయలు బజానాగా పుచ్చుకోవడమైనది. సొమ్ము నాదరంగా నిచ్చినారు, గనుక ముట్టినవి. ఇది నాసమ్మతిని వ్రాసి యిచ్చిన బజానా వుత్తరం.

లోభికొయ్య లింగయ్య.

(అని చదువును)

అంక—అయ్యా! సుందర శివరావుగారూ! ఆరశీదునుక్క జేబులోనుంచండి. మచ్చుకోసంగదా యని వ్రాయించినాను.

సుందర — బావగారూ! ఇఁక నాకు శెలవు.

అంక — సరే! మీరు దయచేయండి. నేను తరువాత వస్తాను.

సుందర — శాస్త్రిగారూ! అమ్మాయికి వస్తువులు మాట మాఱచిపోయినారు.

అంక — అయ్యో! వారి పిల్లయిన తరువాత నగలు పెట్టడం మానుతారూ! భారమంతయు నాయనదే! మీరు ముందుగా వెళ్ళి సొమ్ము సర్దుపాటు చేయించండి. ఆవిషయమయి నేను మాటాడుతాను.

లింగ — బావగారూ!

ఉ. కంపుకు వెంటనే ధనము ; బంధువులందఱు సంతసింతురా
సొంపును పెంపునుం గనుచు ; చుట్టఱికంబది ధన్యమయ్యె నా
కింపు జనించుచుండె భువి ; నింక విధాత కొసంగు మీకు మే
ల్సంపద లెవ్వఁడుం జనుఁడు ; సర్వము చక్కఁగఁ జేయుఁడిత్తరిన్.

సుందర — మంచిది. నాకు శెలవు (అని నిష్క్రమించును)

అంక — లింగయ్యగారూ! మానూ కేమిటో చెప్పి పంపించండి.

లింగ — కట్నము యావత్తు వసూలు కాగానె వాటాలక్రింద పంచుకుందాము.

కామ — కట్నము వచ్చిందాకా మే మాఁగఁగలమా? మాజీవనోపాయము దీనివలననేకదా! మీకంటే సాగుతుంది. మాపొట్ట గడచుట కష్టముకదా! ఏదో దయచేయించండి పోతాము.

లింగ — అంకయ్యా! కామయ్యను చూచావా! కజ్జాకు ముందు కాలు దువ్వుతాడు.

కామ — ధనము సంగతి తలఁచితే మీకు తగవులాఁటగానుంటుంది.

అంక—కామయ్యా! లింగయ్యగారి యంత మహానుభావుఁడు లేఁడు. దమ్మిడి కూడ జాటనివ్వరు. పువ్వులలోఁ బెట్టి మూట్టచెపుతారు. ఈపాటికి పోదాము రా. (లింగయ్యగారితో) అయ్యా! మాకు సెలవు. (అని అందరు లేచును. తెరవ్రాలును)

౩-వ రంగము.

[ప్రవేశము భద్రావతి పడకగది]

(ప్రవేశము భద్రావతి.)

భద్రా—ఆహా! తల్లిదండ్రులారా! ఎంతటి మహాఘోరకృత్యము గావించితిరయ్యా! యీముసలిముండాకొడుకుతో నేబాధ పడలేకున్నాను. ధనమే పావనంబుగా నెంచి దంతములూడిన తాతకు గట్టిపెట్టితిరిగదా! అయ్యో! దిక్కుమాలిన డబ్బు నన్నింతపని చేయుచున్నది. ఆహా! యీముసలి నక్కణముతోఁ గాపురము సేయుట కంటె కాటికాపలా యుండుట మేలు.

సీ. తలను ముగ్గ్వన లేచి | తహతహ బాడును
పువ్వులంబెట్టిన | పోదుచుచుండు
చీరఁగట్టినవచ్చి | చివాట్లు బెట్టును
సబ్బుతోఁ దోమిన | నణగుకొనును
పాటఁబాడినఁ బళ్ళు | పటపట కొఱుకును
పండుకొన్నను చూచి | బాదుచుండు
పోరిగింటఁ జూచిన | పోకిరివని తిట్టు
దొడ్డిలోనికి బోవఁ | దొంగిలాచు
గీ. పనులు జేసిన సిపని | పాడుగాను
వంటఁజేసిన నీవంట | వల్లకాడు
అనుచు సిత్యంబు దిట్టుచు | నదుముచుండు
అరయ కాపురంబును జేయ | దరమె నాకు.

మఱియు,

చ. పుడకలు బొగ్గులుంబిడక ౹ బుట్టలు నించి యొకంగునాఁడు నే
నడిగినదిట్టుచుండు తన ౹ నంతటఁ దాను యొసంగు బియ్యముల్
గడుగుచు విక్రయించు మద ౹ కంబును యమ్మును తిండితిన్నచోఁ
గొడుకును దిట్టు నెప్పుడన ౹ కుంకల ద్రవ్యము ఖర్చుపెట్టఁగా.

ఛీ! వీని బ్రతుకుఁగాల.

ఉ. దగ్గుచుఁ జేరఁబోయినను ౹ దంతములూడినబోసి నోటితోఁ
బుగ్గలు నాకుచుండు వల ౹ పుంగలవాని విధానజూచుతా
సిగ్గునుకింత లేక నను ౹ జేరును వాకిటఁ నిందఱుండినన్
దగ్గును మందు కట్టుకొను ౹ దాస్యగఁ బట్టుచు కొట్టుచుండునో.

ఇట్టివానికి గృహిణినై సంసారము చేయుట యెంతకష్టతరము నా పూర్వ సుకృత ఫలమింతియై యున్నది. (భగవంతు నుద్దేశించి) ఓయీ! భగవానుఁడా! పరమంచిత స్త్రీరత్నము నిబిడ్డలు పడ్డపాట్లు గనుచు ఉపకారసము లేక తిలను గూయుకొనిన నా! పదునాల్గేండ్ల బాలను పాపియగు ముదిగిన లోభికి గట్టిపెట్టితివా! అందుచేత నదియెంత కష్టము ననుభవించుచున్నదో నీకుఁ దెలియునా? ఆహా! నిన్ను ననవలసిన పని లేదు. ఈనరకములోఁ బడద్రోసిన నా తలిదండ్రుల ననవలయును. కానిమ్ము. కష్టమనుభవింపక తప్పునా? తల్లిదండ్రులారా! దయయను మాట లేదుగదా? ధనమే ముఖ్యముగ తలంచుచున్నది. అనేకము మీరు చేసిన ఘోరకృత్యములకే గుంపుచుంటిని. సర్వసుఖముల ననుభవింపవలసిన దానను పదియేనంబడి కొట్టుకొనుచుంటిని కదా? క్షేమము లేని నా జీవనము నాకేల. అవును. లోకోక్తి కలోటుగలుగునా! "పుణ్యముకొలఁది పురుషుడు దానముకొలఁది బిడ్డల"ని ధాత్రీజనులు నుడువుచుందురు. నేనెంత మొత్తుకొన్న ననుమంతయు లాభము లేదు. కనుక నేనిప్పుడు గాపురము ఖండించనేల? కాని యెంతముసలి వాఁడయినను గాపురము చేయవచ్చును కాని పెనులోభితోఁ గాపు

రము చేయుటతికష్టము, విధాత యేమదార్థము పెట్టిలోభిని సృజియించె నోకదా? లోకులు కాకులు వంటివారు. శాస్త్రులోటయున గంపంత చేయుదురు. (పరికించి) ఏమూర్ఖ్వవి-ఆ-అదిగో దరిద్రి కొట్టు నావ రమువుచున్నాఁడు. కాని కానిమ్ము. (అని పరుండును.)

లింగయ్య—(పరివేశించి) నాలేమావిగున్న లేచినదికాఁబోలు. దీపాలుపెట్టకుండఁగనే పాన్పుమీద పవళిస్తుంది. పొద్దుమన తొమ్మిదిగంటలయినను పక్కకుయినుంచి లేవదుకదా! దీనితోఁ బడేపాట్లు దేవునికి తెలియాలి. దీనితోఁ జెప్పకుండా యీసంబంధము కుదర్చినందుకుఁ జెప్పుదెబ్బలు తగలవుకదా! (దగ్గఱకుబోయి చేయిపట్టుచు) ఏమే యింకాలేచేవు కాదు! యింతబద్ధకంయిల్లాలుకుఁ బనికివచ్చునా! లే—లే మంచిమాటచెపుతాను. నీకు కావలసిన చీరలు రవికెలు నగలు సర్వం సమకూడే సమయం సంభవించినది. లెమ్ము నా మాటమీఁద గురియుంచవే!

భద్రి—(మూల్గుచు) నియిల్లువల్ల కాకుండా నా! సూర్యోదయం కాందే సూదులు పుచ్చుకొని లే లే యని పొడుస్తారేమిటి. రాత్రి రెక్కలు ముక్కలయేటట్లు చాకిరి చేసి చేసి పడుకొనేటప్పటికి పండ్రెంటుగంటలయినదికదా! కాసేపు కాళ్లుచాపుకొని పడుకుందామంటే దినం లేదుకదా! కాఁపున్నది లగాయితు లేచేవరకు పళ్ళపటపట కొరుకుతుంటావుకదా! నాకే విధాన సుఖం లేదుకదా? నారాయణ. నారాయణ నాబ్రతుకుగాలిపోనుగలా. నాతెనములా వాలు రోజులు భోజనము మానితే పంటకుముక కామనాను. (అని కళ్ళు నలుపుకొనుచు లేచును.)

లింగ—అమ్మా! అమ్మా! యెంతలేసి మాటలంటున్నావే. దగ్గఱకుఁ జేరితే దవడమీద లెంపకాయలుగదా! దూరానవుంటే ధూముధాంలు. కనపడకపోతే కర్రతీస్తావుకదా! నాకర్మము కాలిపోను.

వాళ్లుపెండ్లిండ్లు చేసికొంటె వాకీ తిప్పలుతప్పుతిల్లాయి. డబ్బయివత్సరముల దౌర్భాగ్యునకు వాళ్లో వివాహ మేమిటికి బ్రతికిన వాళ్లురోజులు మర్యాదుంచవే—ఏశుభవార్త పలుకుదామన్నా పోట్లాటసిద్ధము. తలంచిన కార్యము కాక తగవులాటయునది.

భద్రా—మీరు చెప్పే శుభవార్తలు చూడలేక మూడుతున్నాను. ధనమో! ధనమో! యని తనువుతగలపెట్టుతారు కదా? దమ్మిడికోసం దవడలబాచుకుంటారు.

లింగ—ఆ పాయంత్రము నీతోఁ జెప్పిన పెండ్లి వారు నిన్నను వచ్చారు. అబ్బాయిని చూచారు. సంబంధము నిశ్చయించుకున్నారు. పదివేలురూపాయలు కట్నము—

భద్రా—(మాటకడ్డమువచ్చి) మీకు కట్నం కట్నం అనిగోల యేకాని ఆడపడుచులాంఛనములు వియ్యపురాలు లాంఛనములు తలపెట్టరుగదా?

లింగ—నీకడుపు బంగారముకానూ! ఆమాటనే చెపుతూ యుంటే మాటకడ్డతగిలినావు. అందుచేత చెప్పుటకు వీలుయిచ్చినది కాదు. శ్రద్ధగా నాలకింపుము. ముందు నేనడిగిన సంగతులివి. వియ్యపురాలు లాంఛనములు రివాజు ప్రకారము ముట్టచెప్పవలయునని ఖరాఖండనతోఁ జెప్పినాను.

భద్రా—రివాజుప్రకారము! అంటే వారిష్టప్రకారము యిచ్చి యిదే రివాజు అంటారు.

లింగ—అంత తెలివితక్కువవాడనా! తరువాతవియ్యపురాలు లాంఛనములు వివరంగా కాగితముమీద వ్రాయించినాను. వినుము. అయిదురోజులు అయిదు పెద్దచీరలు, అయిదు మొహిరీలు, అయిదు పెద్దకాసులు, అయిదు కుర్చీలు, అయిదుమబొట్టుపెట్టెలు, అయిదు వెండి పలుదోముపుల్లలు, అయిదు కాటుకకాయలు, అయిదు వెండి కుంకమ

భరిణెలు, అయిదు కెంపుబుడ్డలు, అయిదు పన్నీరుబుడ్డలు, అయిదురక ముల అద్దములు, తరువాత వియ్యపురాలికి కావలసినంత కంజాయింపు చేయించవలెనని స్పష్టముగాఁ జెప్పినాను.

భద్రా—ముహూర్తము నిశ్చయించినారా యేమిటి?

లింగ—ఆ! నిశ్చయించినాము. ఇరువయి రోజులున్నది,

భద్రా—కోడలకు నగ లేమి పెడతావన్నారు?

లింగ—కోరిననగలు పెడతానన్నాను.

భద్రా—ఆఁ. మీరు పెట్టినట్టే. ఆపిల్ల సుఖపడినట్టే. చాలుచాలు. నేను మిమ్ములను పెండ్లియాడి యింత అనుభవిస్తున్నాను. మీ అబ్బాయిని పెండ్లియాడి ఆపిల్ల యింక అనుభవిస్తుంది!

లింగ—నీకెందుకే వాగొదవ.

భద్రా—తల్లిదండ్రిలకు దెలియక మీ అబ్బాయికి గట్టిపెట్టారు కాని తెలిసినవాళ్ళు మీ అబ్బాయికివ్వరు. సరే; దానికేమిగాని వారిం పెండ్లికి చీరలు కొనరూ? నగలుచేయించరూ? నలుగురులోనికి వెళ్ళినప్పుడైనా నగలివ్వరా యేమిటి?

లింగ—వియ్యాలవారు విరివిగా చుట్టచెపుతానన్నారు. అందులో నాకేమియు నక్కఱలేదు. అంతా నీవే అనుభవించు. తిరిగి యిప్పుడు మళ్లీ పెట్టుఖర్చు పెట్టుటెందుకు?

భద్రా—సరే! మీ యిష్టమువచ్చినట్లు చేయండి. కొనుటకిష్టములేనప్పుడు గొంతుక కోసికొన్నా కొనరు?

లింగ—అబ్బా! అస్తమానం నన్ను బాధ పెట్టకే. పెండ్లింకాయిరువదిరోజులున్నదికదా? యీలోపుగా చేయించలేనా

యేమిటి. నాకుఁ జాలాపనియున్నది. వ్యవహారములు త్వరితముగా ముగిం చవలయును. నీవు పెండ్లిపనులన్నియు జక్కఁజేయుము. కావలసిన సామగ్రియంతయు సిద్ధము చేయుము. నేను బజారునకు వెళ్ళి సామానంత టాకలివానిచేతఁ బంపిస్తాను. జాగ్రత్త చేసి సర్దుపాటుగా నుండుము. నేను పోయెదను (అని నిష్క్రమించును.)

భార్య—అబ్బా—యిప్పటికి యీపోరు వదలినది.

చ॥ వనమునఁ గాపురంబు సుఖమై చర్యముఁ గొనరింపవచ్చు వా
వనధిని నీఁదఁగవచ్చుఁ గుల పర్వతముల్ సుకరంబు దాటవ
చ్చును విషమున్ భుజింపఁగను జోరులఁ బట్టఁగవచ్చుఁగాని ధా
త్రిని పెనులోభితోఁ గలసి రేఁబవలున్ జరుపంగ సాధ్యమే!

సృష్టికర్త లోభి నేవిధముగా నే పదార్థముఁ బెట్టి సృజించెనో కదా?

(తెర వ్రాలును.)

నాల్గవ రంగము.

ప్రదేశము—సుందరశివరావుగారి గృహము.

ప్రవేశము:—సుందరశివరావు—గుణవతి.

సుంద—తరుణీ! ఆడుబిడ్డలఁగన్నవారి జీవనము కష్టతరము సుమీ!

ఉ॥ ముద్దుగ బిడ్డలంగనిన ముద్దుగఁ బెంపఁగ నొక్కచింత, నె
విద్దెలు నేర్పఁ జింత, వ్యాధి పీడలిడంగ వరుండు కూర్పఁగా
దద్దయుఁ జింత, వారలకు దారధనాదులఁ గూర్పఁ జింత, నా
కెద్దియుఁ దోచకుండ హృద యేశ్వరి నేనిఁక నేమి సేయుదున్:

గుణ—నాథా! మీరు వెళ్ళినపని యేమయినది?

సుంద—నేను వెళ్ళినపనియంతయు బాగుగానే నెఱవేరినది, పాపమా అంకయ్యశాస్త్రిగారుండఁబట్టి ప్రతివిషయముం గొనసాగినది.

సంబంధము స్థిరపడినది. పదివేలరూపాయిలు కట్నం వియ్యపురాలు లాంఛనము రివాజుప్రకారంజరుపవలయును. కట్నం పెండ్లికియిరువదిగో జాలు ముందుగా బంపించమని చెప్పినారు, ఇప్పుడుపదివేలరూపాయ లునాకెక్కడ సంభవించును సంబంధము కుదిరినదాకా యొకగోల, కుదిరినతరువాత నొకగోల. కట్నము తప్పనిదే కార్యసన్నాహములు చేయరట. రొక్కంనావద్ద ప్రస్తుతం లేదు.

గుణ—లింగయ్యగారి కుమారుడేనా?

సుందర—అవును. ఇదివరకునుంచి చెప్పే గొడవంతా యేమిటి?

గుణ—సంబంధము చక్కగానే కుదిరినది.

సుందర—పదివేలరూపాయిలు వదలుచున్నవి.

గుణ—అబ్బా! కట్నము చాలవరకు పెట్టారు!

సుందర—పెట్టబట్టే కుదిరినది! వియ్యపురాలుకు పయివ్యాపారమునకు మొత్తం పండ్రెండువేలరూపాయిలు కావలయును లేనిదే కార్యము నడవదు.

గుణ—కాగలదు ఈభారము కూడా అంకయ్యశాస్త్రిగారి మీదనే మోపండి

సుంద—ఎన్నివిధంబుల సమకూర్చినను కార్యమునానుకూలపడుట చాలకష్టము. మాదిరితివా! కట్నము తప్పకుండిన కార్యము చేయునని వారు లింగయ్యగారు చెప్పినారు

గుణ—ఆలస్యమేల? త్వరగాభోజనముచేసి అంకయ్యగార్ని తీసికొని సొమ్మునకుదారిచూడండి.

సుంద—సరే! అలాగునే చేసెదను.

అంక—(ప్రవేశించును) సుందరశివరావుగారూ! సొమ్ము సంపించుటకు వాయిదాసమీపించినది. భద్రముచేసినారా?

సుందర—దానిమాటయే తలపెట్టుచుంటిని.

గుణ—దైవములాగున మీరుమాకు సహాయముచేయుచున్నారండి.

సుందరి—శాస్త్రిగారూ! యీవిషయము లింగయ్యగారి మధ్యన యేమయినా ప్రస్తావించినారా?

అంక—నేను వచ్చినప్పుడే లింగయ్యగారువర్తమానం పంపించినారు. రేపటిలోపుట సీయాకతప్పదు. గరాజామనుష్యులతో బని.

సుందర—అవును. పంపకతప్పదు.

గుణ—శాస్త్రిగారూ! మాఅమ్మాయికి కష్టముగానున్నదండి కట్నమిచ్చుట

అంక—పసిపిల్ల. ఆమె కేమి తెలియును లెండి. ఇద్దరకూ వివాహముచేస్తే చిలకాగోరింకలాగున పడియుంటారు. పిల్ల లాలోచన మానము వినడమూ ఆచారంచేయడం బాగుండదు. అన్నియు మీకే తెలియును.

సుందరి—అయ్యా! అంకయ్యగారూ! ఆలస్యముతో బని లేదు. అప్పునకు వారిమీకే చూపించవలయును. అంతామీదే భారము

అంక—ఈరోజులలో అప్పుపుట్టుట మహాకష్టంగావున్నదండి. వడ్డీలుమహా వాటంగానున్నాయి. నూటికి రూపాయితొమ్మిదణాలు పుచ్చుకుంటున్నారు. కోమటి కోటయ్యఅనువర్తకుడుగలడు. అతనితో మాటాడి యావత్తుసంగతి మీకు చెప్తాను, మీరుకూడా భోజనము చేసి మాయింటికిరండి. (అంకయ్య నిష్క్రమించును.)

సుందర—అమ్మాయీ! సిలాంబరీ! యిటొకసారిరమ్మా.

(సిలాంబరి ప్రవేశించును.)

సిలాం—తండ్రీ! యేమియాజ్ఞ?

సుందర—సంబంధము నచ్చినదా?

సిలాం—నాయనా! నా మనవియాలకింపుడు,

సుందర—ఏమిటమ్మా నీకోరిక?

సిలాం—తండ్రీ! సంఘదురాచారములు నాశముచేయుటకు

చేతికి కంకణముగట్టితివిగదా! అట్టినీవు నేఁడు కట్నమిచ్చుట పాడియా?

సుందర—ఏమైనఁ గానిమ్ము కట్టవలెను.

గుణ—వెఱ్ఱిదానా! లోకజ్ఞానశూన్యవు, నీకేమియు తెలియదు. కాఁబట్టి యిట్లు పలుకుచున్నావు.

నీలా—అమ్మా! నేను త్రికరణశుద్ధిగఁ జెప్పుచుంటిని-కట్నమిచ్చినవరుని నేఁ బెండ్లియాడను. త్రికరణశుద్ధిగాఁ జెప్పితిని.

సుందర—అమ్మాయీ! నీవు చాలాచిన్నదానవు. నీకు పట్టు కూడదు. కాలమును బట్టి నడువవలయును.

నీలా—తండ్రీ! ఉన్న మడిమాన్యములనమ్మి పెండ్లిచేసి పిమ్మట నేమిగావించెదవు? తినుటకు తిండి యుండవలయునా? నేను మిమ్ములను దయతోఁ జూచుచుంటినే! ఇట్లొనర్చుట పాడియా?

గుణ—అమ్మాయీ! ఇంత పెంకిపట్టు గూడదు. కొంచెము మామాట పాటిచేయుము.

నీలా—అమ్మా! నాయభీష్టము వ్యతిరేకింపఁ గాను.

(అని నిష్క్రమించును.)

(తెరవ్రాలును.)






## చతుర్థాంకము.

### మొదటి రంగము.

(ప్రదేశము సుందరశివరావుగారి గృహము.)

కమలాంబ—(చేతిలో ఛాయాపటముతో ప్రవేశించును.) మా అక్కయ్యకు లభించిన వరుండు మిక్కిలి చక్కనివాఁడు. వీనిని అసాధారణముగా సౌందర్యమునుండి సృష్టించియుండుటయే కాని పరిశీలించి యెన్నఁడుఁ జూచియుండలేదు. ఈపటమునుఁ జూచినకొలఁది నామనస్సు మేరలేని యానందమందుచున్నది. కాఁబట్టి నేనుముందుఁ జూచి పిమ్మట సహోదరికిఁ జూపించెద (అని పటమునుఁ జూచుచు) అహా! వీనియందచందంబు లేమని వర్ణించెద.

ఉ. కన్నులు పద్మపత్రముల కంటె విశాలములయ్యెఁ జంద్రుని
వన్నెను మించె మోము, పది వందల నిచ్చిన సాటివాని నిం
కెన్నఁడు గాంచలేము, తను వెంతయు నారసి చూడఁగాను య
త్యున్నతమయ్యె, ముక్కుఁగను నొప్పుగనుండె వరుండు ధాత్రిపై.

అక్కా, ఒకతూరి యిటురమ్ము. నీకుమిక్కిలి చక్కనివింతఁ జూపించెద.

నీలాంబరి—(త్వరగాఁ బ్రవేశించి) చెల్లీ! ఆవింత యేమె!

కన—(పటముఁ జూచి) ఈచిత్రము యెవని చిత్తరువుఁ గాంచితివా?

నీలా—దీనిలో నేమిచిత్రమున్నదే! నీవెప్పుడు గోరంతదానికిఁ గొండంత చేసెదవు.

కనకాం—అక్కా! కన్నులకు గట్టినట్లు స్పష్టముగా ఛాయాపటములో బాలుఁడుగనిపించుచుండ యేమిచిత్రమని యనుచుంటివేమే!

నీలాం—ఏమో! నాకుఁ దెలియదు. దీని నెన్నఁడు నేఁజూడలేదు. నాకంతయు నడవిగా నున్నది.

కనకాం—ఏమిచిత్రమా! బావగారి చిత్రము.

నీలాం—ఏ బావగారు!

కనకాం—ఇంకా! ఏ బావ యని యనుచుంటివా? నాన్నగారు నానాకష్టములఁ జెంది పదివేలరూపాయలకు వేలములోఁ గొన్న బావ! ఇప్పుడు బాగాఁజూడుము.

గీ. చూపులకు సుందరుండు నీ కే రూపురేఖ
గాని తెలఁబులో కొన్న కే కాంతుఁడయ్యె
కట్నమునకుఁ దగ్గవయుండు కే కాదు అక్కా!
ఇట్టి వానిని నీకేల కే గట్టవెట్టె.

నీలాం—ఇదియా! ఇంక చూడ నక్కఱలేదు చూచి నందుకుఁ గూడ సుంకంబు చెల్లించవలయు నేమో?

కనకాం—అలాగు ననుచుంటవేమే అక్కా! కాళ్ళరిగఁ దిరిగి కష్టపడి నాన్నగారు నీకు సంబంధముఁ జూచి వరుని ఛాయాపటము తీసికొని వచ్చినందుకయినను చూడవే. దబ్బుచెల్లించినదైనఁ జూడఁదగిన పటమే, ఎందుచేత నంటివా?

తే. గీ. ఇల్లుమాన్యంబులన్ని క్రయించినట్టి
వరుఁడు యీతండు లభియించె నే భాగ్యవశము

చేత, ముందుగాఁ బటము జూచి దివసశించు।
జాతమంతయు నేత్రముల్ చర్వమాను.

నీలాం—చెల్లీ! నన్ను వేళాకోళముఁ జేయుచుంటివా?

కమలాం—అక్కా! వేళాకోళమును యున్నదే! భారతదేశమునందిట్టి యభాగ్యులు బయులు దేఱినందుకు నేనీమాటలు బల్కితిని. కాని నిన్ను దెప్పుటగాదు సుమీ! అయినను అక్కచెల్లెండ్రు వేళాకోళములు చేసికొందురా?

నీలాం—ఆతలంపుయే నాతలంపుకూడ. అందువలననే నీ పటముఁజూచుటకు భయపడుచుంటిని. ఆహా! వరశుల్కములవల్ల కాలమెట్టి గొడ్డలిపోయినదో తిలకించితివా?

ఉ. భారతదేశమానినుల భాగ్యరశ్మి నశించెఁ గట్నముల్
గోరెడిమాన్యులున్ వెఱిగి కోవిదులొక్కఁడు లేదు పెండ్లి వ్యా
పారము భంగిగాను వసు సంగతి దలంచిన వారెకాని యీ
తీరున నూడఁగూడదట తేలికగా వచియింపలేరుగా.

సీ. మానాభిమానముల్ మంటలోఁ గలిపి గ
ట్నాలఁ గోరెడు దుష్టమనుజుఁడొకఁడు
సమయంబులేకను సాధించి లాంఛన
ములు కోరు ధాత్రిలో మూర్ఖుఁడొకఁడు
పిల్లనిచ్చిన వాని పుల్లనమ్మించి స
ర్వంబు హరించు యభాగ్యుఁడొకఁడు
సతిజాతులుం లేక సివె దేవుఁడవని
ద్రవ్యంబులాగఁగా దలఁచు నొకఁడు

గీ. వందువుల క్రింద మగకొంత బాధ చేయు
మాటిమాటికి సాధించి మరికొంత

కూడబెట్టును చివరకు కీ గోతులోన
దింపు కన్యదాతను నేడు కీ దేశమందు.

కాఁబట్టి వరులశుల్కము లోనంగి పెండ్లియాడకూడదనికలికాలకా పురములీతి బాధలచే తెలియుచున్నవి. అందువలన కల్యాణముల కాంతుని యవ్వలఁ బెట్టుము. అందచందములతోఁ బనిలేదు. ఈమధ్య నాయన గారు పడుబాధలు నీవెఱుంగవా?

కనకాం — ఆ! ఎఱుఁగకేమి! అన్నియు నెఱుఁగుదును.

నీలాం — ఎఱిఁగియుండియేనా! ఇటులాడుచుంటివి

కనకాం — నీముక్కలు వారిఁ జాలశోచనీయముగా నున్నవి.

నీలాం — అవును కాని-అకటకట నీకెక్కడ లభియించినది?

కనకాం — పెండ్లికుమారుని తండ్రి శుభలేఖలలో వేయించ మని పంపించినారఁట;

నీలాం — అబ్బా! ఎంతమాటాడితివే! దిల్లిగవ్వకు చిక్కులు పెట్టు పెండ్లికుమారుని తండ్రి కావించునా?

కనకాం — పెండ్లి తొందరగాఁ జేయవలెనను యుద్దేశముతో ఛాయాపటము పంపించి శుభలేఖలనచ్చొత్తించమని చెప్పినారఁట. తరువాత నాయనగారిని దానికయిన ఖర్చును పంపమన్నారఁట.

నీలాం — ఇప్పుడే యింతపంతిములు వచ్చినవా?

కనకాం — రావా మఱి! సంబంధము దాటిపోవునేమో యని సంకోచముచేత మాఅత్తవారు అడావిడి పడుచున్నారు.

నీలాం — హుష్! ఊరకుండుము. నాయనగారు వచ్చుచున్నారు. (అనిలోనికిఁ బోవును.)

సుందర — (చావడిలోనికి వత్తురు)

కాఁబట్టి తలఁచుకొన్న కార్యముఁ జరుగవలయును. "ఆలస్యమమృతం విషం" అన్నట్లు కాలయాపన చేయరాదు. మనకు వేయిజన్మములెత్తినను తలఁచుకున్న యీసంబంధము లభించదు. భాగ్యదేవత మీయందు తాండవమాడుచుండుటచేత అదృష్టవశాత్తూ అనుకున్న రీతిగాఁ జరిగినది.

తే. గీ. ధనము లేదని మదిలోన వెదలఁ వలదు
మీకులోకైన వసులెల్ల మేలుగాను
చేయఁ దలఁచొసి యున్నాఁడఁ జిత్తమందు
కోర్కె శీఘ్రింబు ఫలియించు కుందకేల!

గుణ—ఆలోచన మెందుకు. చేయఁదలఁచిన కార్యమేదియో వేగము చేయుఁడు.

సుందర—అయ్యా! శాస్త్రిగారూ! చెడియున్నుకొన్నను ధనము సరిగా వచ్చుటలేదుకదా? కాసింతు. అమ్మకము చేయక తప్పదుకదా? మీరు ముందుగాఁ బోయి దస్తావేజు వ్రాయింపుఁడు.

అంగి—సరే నేనుఁబోయి సర్వకార్యములు సిద్ధముగా నుంచెదను. మీరు భోజనంజేసి వ్యాపారమునకుఁ గావలసిన రికార్డునంతయు తయారుగా నుంచండి. నిమిషములో నేను కూడా భోజనంచేసి వస్తాను.

(అని నిష్క్రమించును.)

గుణ—సరే; మీరు త్వరితముగా స్నానముఁ జేయుఁడు?

సుందర—ఏమిస్నానము, ఏమిలోకము. నాపూనసమంతయు ఖులాసాగా లేదు. ఈకడియకరములు భూమిగూడ అమ్మివేయుచుంటిమి కదా? మన జీవనోపాయమెట్లు?

గుణ—మీరే, అట్లనుచుంటిరి. ఇంక నీయుటలబ్రతుకేమి కావలయును.

సుందర—పిచ్చిదానా! అధైర్యమెందుకు (ఆలోచించి)

మ. ధరఁజన్మించెను జీవసంతతికి సంసారంబు కష్టంబులున్
దిరమైయుండవుకొన్నినాళ్ళు ధనముల్ చేకూర్చు దారిద్ర్యముల్
మఱికొన్నాళ్లు వశింపఁజేయు దనహా కంజేమియున్ జూవకన్
బరగంగాఁదలఁతోయ సుండిరిమనల్ పాలించి పోషింపఁడే

గుణ—అవును. నిజమే. పుట్టించినవానిని బోషింపక యూరుకుండునా?

తే. గీ. సర్వజీవులఁ గన్నయా జలజభవుఁడు
అఖిలప్రాణుల రక్షించు నాదరమున
బిడ్డ కల్పంబులోఁ బుట్టి బ్రతుకనొంది
యున్న మనల నతఁడు గావకున్నవాఁడు,

సుంద—సరే బాగున్నది. కాలమతిక్రమించుచున్నది. నేను శీఘ్రముగాఁబోయి పనులు నెరవేర్చుకొని వచ్చెదను, లెమ్ము.

(అని నిష్క్రమించిరి.)

రెండవరంగము.

ప్రదేశము-(కోమటి కోటయ్యగృహము) (ప్రవేశము. అంకయ్యగారు)

అంకయ్య—సుందరశివరావుగారికి పది హేను వేలు రూపాయలు కావలెనఁట. మాన్యము తనఖా యిచ్చెదరు వారి స్థితిగతులు నీకెఱుక గదా?

కోట—ఎఱిగుండబట్టే ఇస్తానంటున్నాను. వడ్డీ రూపాయి తొమ్మిదణాలు తక్కువ పడదు. నేను పదిహేను వేల రూపాయలకంటె యెక్కువ యివ్వ లేను. అది అంతకంటె యెక్కువ కమ్మతు చేయదు.

సుందర—వారం రోజులలో కావలయును. మాన్యమంతయు విక్రయించెదను. క్రయమునకుఁ గొనుఁడు.

అంక—కోటయ్యా! అలాగున కానిమ్ము. పొంత్తంగా నీవే కొనుము. పద, దస్తురీసికొనిరా?

కోట—నేను మొత్తము క్రయానకయితే పదమూడు వేలిస్తాను.

అంక—ఆ రెండు వేలుకూడా కట్టుకొండి. మంచి ధాన్యం పండే భూమి. యకరం రెండు వేల రూపాయలు చేస్తుంది. పదియకరములు భూమి కదా ?

సుందర—కోటయ్యగారూ ! అలాగున చేయండి.

అంక—(కన్నుగీటుచు) కోటయ్యా ! పేరభిప్రాయమేల ! నీకెందుకు సందియమొందెదవు! త్వరగా కానిమ్ము.

కోట—శాస్త్రిగారూ! చంపుకు తింటారండి.

అంక—త్వరగా లేచి దస్తు తీసికొనిరా ?

కోట—రిజస్టరీ ఖర్చులు మీవే. నాకు నిమిత్తము లేదు. stamp తీసికొనివచ్చారా? లోపలకురండు సొమ్మిచ్చెదను.

(తెర వ్రాలును)






## పంచమాంకము.



### 1-వ రంగము.

(ప్రదేశము నీలాంబరి-పడకగది)

నీలాం—ఆహా! జనకా! అసపంతయుఁ జేసితివా! అక్కటా! కాలమెంతగాఁ బరిణమించుచున్నది. కట్నములు గోరువానిని నేఁ బెండ్లియాడనని పలువిధంబుల బోధించినను మా జననీజనకులు నా మాట పాటింపరు కదా?

ఉ॥ చెప్పితినెల్ల సంగతులు చిత్తమునందు ననేకభంగులన్
దిప్పితి యుత్తరోత్తరపు దీయనికల్ వచియించి తండ్రితోఁ
దప్పిదమంచు దెల్పితిని దండ్రియు లెవ్వియు నాలకించిరా
మెప్పొకొసంగ లేదు మది నోర్వఁగశక్యము భూతలంబునన్.

చివరకు సిగ్గు విసర్జించి భాషించుట తప్ప వేరుపాయము లేదు. దైవమా! అబలబ్రతుకెంత చులకనబ్రతుకైనది!

శా॥ స్వాతంత్ర్యం బొకయింత లేదు మదిస్వేచ్ఛావృత్తి లేదెందునో
రీతిన్ గౌరవమున్ గనంబడదు పాపిష్ఠంగ్రి పెంపొందియున్
నాతుల్దగ్గఱ లేదు కట్నములు వా ద్రవ్యంబుల్ సమర్పించి ప్ర
ఖ్యాతిన్ బెండ్లిని జేయఁగావలసెఁ గన్యాదాత ధాత్రిస్థలిన్.

ఓయీ! తల్లిదండ్రులారా!

ఉ. పెంచియుఁ బెద్దఁజేసి కను । విద్యలు నేర్పి వివాహమిప్డు కా
దంచుఁ దలంచి మాన్యముల । నమ్మికముంగడు గట్నమిచ్చి మీ
రెంచితిరే వివాహమొన । రింపఁగఁ జాలును మీకు శే
దంచును భోజనంబు హృద । యంబున నాకు విచారముంచరే.

వెండియు.

చ. ధనముఁగలావిర్గ సిరులు । ధాత్రిని మీరొసగంగ భావ్యమే
తనయను ముద్దుగాఁ బెనిచి । దానము జేసిన పుణ్యముందు మీ
తనువు ఫలించు, లోకులు న । వాఁకొనియాడరె! మిమ్ము బీదకుఁ
ధనము నొసంగి పెండ్లినను । దద్దయుఁ జేసిన సౌఖ్యముందనే.

తండ్రీ! నీవేకదా! సంఘసంస్కర్తవై చెలరేఁగినావు. కట్నములు నీయఁగూడదని వేదికలపై నెక్కి యుపన్యాసము లక్కరి బిక్కిరిగా నిచ్చినావు. అట్టిమహానుభావుండవు నేఁడు నీవీపనిఁ జేయ భావ్యమా? నా పెండ్లికి యిసీవు పడినశ్రమలు లెఖింపశక్యమే! అంతకట్నమొసంగి పెండ్లిఁజేయుటకంటె బీదవానికి నాకట్నమొసఁగి వివాహముఁ జేయుట యుక్తము. ఇటులఁ జేయఁ బాడియా?

ఉ. కట్టా! గృహంబు లమ్ముకొని । కట్నములీయఁగఁ బాడియా నా! నేఁ
బుట్టిన నాదిగా సుఖముఁ । బొందఁగలేదు వియోగసాగరం
బట్టిరి నేఁడు, నావరుస । మంగళసూత్రము బొందినుంచి నే
నెట్టుల జీవమొందు నవ । నిజనులందఱు బుద్ధిదిట్టలే.

ఆహా! నేనిటువంటి మహాఘోరకృత్యము భరింపఁగలనా! పెద్దలనాటి నుండియు పేరువహించిన మనమాతృభూమియందిటువంటి సంఘదురాచారములు చేయవచ్చునా? ఓయీ! తండ్రీ! నీవే నడుముఁ గట్టుకొని సంఘదురాచారములు తొలఁగించుటకుఁ బాటుపడితివే! అట్టినీవు తిరిగి యిటులొనరింపఁ బాడియా? అనేకోపన్యాసములలో సభ్యుఁడవుగా

నుండి సంఘదురాచారములు చెందఁదలఁచితివే చాలు. చాలు. సాహసించి నీవీపనిఁ జేయుచుంటివా?

తే॥ గీ॥ ఆదినుండియుఁ బెద్దలు । నడుగునంట
జేసికట్నము, జయటకుఁ । ద్రోసినీవు
నడుగుఁదలఁచితివే! తద్బాధ । న్యాయమవును
పూజ్యతరమైన మనపుణ్య । భూమియందు.

ఇదియంతయు భారతమాత దురదృష్టము. లేకున్న పూర్వమునుండి లేనిదురాచారము నేఁడుపుట్టనేల. ఓయీ! మహాజనసమూహములారా! యీభారతజనసంఘంబునందుదయించి సంఘదురాచారములనిట్లు వదలఁజాలకుండిరిగదా? అహా! పెండ్లిండ్ల బాధయొక్కటియా!

ఉ॥ వేలకు వేలుగట్నములు । నియ్యపురాలకు లాంఛనంబులన్
జాలగుకోలముల్ వ్యయము । సల్పవలెన్ గడుగాంచనంబులే
లేలను ముట్టఁగావలెను । లేరఁగబా, మగవారికివ్వఁదున్
చాలును చాలుధాత్రినిఁక । శక్యమె! పెండ్లిని జేయుటిప్పుడున్.

హా! పరమేశ్వరా! దయాసాగరా! సికాలచక్రంబు నీలీలఁద్రిప్పెట బాడియా! నీయవతారము లతిచిత్రములుగదా?

ఉ॥ చక్రము దాల్చినీవు రిపు । చక్రము ద్రిప్పెటదేమివింతనీ
చక్రమమే యొసర్పునెడ । నాగునె! యీచతుర్ధులన్ మహీ
చక్రము లాత్రిలోకములు । సారసనేత్ర! కృపారసాంగ చేఁ
జక్రముదాల్చినీల వలు । చెందఁడెఁ బెండ్లి ధరాతలంబునన్.

కృష్ణా! జగద్బంధూ! కోరికలీడేరక కోటికోలంది జనంబులుర్వీని గూరుంబునఁ బడుచున్నారుకదా!

శా॥ ఓయీ! తండ్రి, కృపాబ్ధిచంద్రమ! మహా । ఓంకారరూపంబుతో
గాయంబున్ సృజియించినావు ధనమున్ । గల్పించిసాధంబులన్

మాయామర్మము లేకఁ బుట్టితివి నా మర్యాద గాపాడఁగా
నీయగ్గింబడి మ్రగ్గిపోయెదను నీ వెంతేనియున్ దిట్టినన్.

కావున - నాతలిదండ్రుల కపఖ్యాతి రాకుండఁ గాపాడుటే ధర్మము. హా! భారతమాతా! నీపవిత్రగర్భమునం దనేకజను లుదయించి సౌఖ్య సాగరమున నోలలాడుటలేదా? నాకేల నీవట్టిదానంగ లేదు? నాతల్లి దండ్రులు నోచుకొనలేదు. వారేల నీదుఃఖాబ్ధి మునుంగవలెను. తల్లిదండ్రులకు సంఘబాహ్యంబు గలిగింప మనంబొప్పకున్నది.

తే॥ గీ॥ తల్లిదండ్రులు ప్రేమారఁ బదముఁ జేసి
కన్నపుత్రిని, నన్ను దుఃఖంబునందు
ద్రోయఁగా భావ్యమే తల్లి తోయజాక్షి
ఆడువారల, పుట్టువపఖ్యాతిగాదె.

భగవంతునివ్రాత తప్పింప నెవరితరము. నాపుట్టుకవల్ల తల్లిదండ్రులకు కష్టములే కాని సుఖములు లేవుకదా? భూమాతకు భారభూతమైన శరీరమొందుకు భగవంతుఁడు సృష్టించెనో కదా? ఓతల్లీ — సకలసద్గుణని కురుంబా! నీగర్భంబున నుద్భవించినందులకు నీకు గష్టమే కాని యానందము లేదుగదా? అమ్మా! యేమి చేయవచ్చును. ఈశిక్ష నేననుభవింపక తప్పదు. అహా! భగవంతుఁడా! పశువులకు, కీటకములకు, నరులకు సహజమయిన కాలమరణమును నాకుఁ గూడ పెట్టక నిట్టి యకాలమరణము నందు సయిన బలవన్మరణము నాకేల తెచ్చిపెట్టితివి. హా! తండ్రి! నామాటవినకపోతివికదా! ఉన్నమాన్యముల నమ్మి నాకు ద్వివాహ మాచరించిన సహోదరీ వివాహమెట్లు సాగింతువు. భూముల నమ్మిన నిమ్మాటనీ వొనరించు కార్యము వీనమయనను లేదుకదా? కరువాత ముష్టి యెత్తుదువా? నేను బ్రతికియుండినా దారిద్ర్యదుఃఖమును గాంచనోపను నీకు రాఁబోవు సంఘదూషణమును చూచి నేను భరింపఁజాలను. నాకట్టి

సాహసముగూడను. ఆత్మహత్య ఘోరపాపమని పెద్దలు చెప్పుచుందురు. అయినను అట్టిదనుభవింపక తప్పదు. తల్లిదండ్రులారా! తరువాత విచారించిన లాభమొక లవమాత్రమును లేదుగదా? యని రాత్రింబవళ్ళు యేడ్చినను లెక్కసేయకపోతిరిగదా! శ్రీమన్నారాయణమూర్తి యాజ్ఞ యనుల్లంఘనీయము. అమ్మా! తండ్రిగారు పరమపూజ్యులు. వరుల నవలసిన పనిలేదు. నేను బుట్టకుండిన యెడల మీకీ దురవస్థ తటస్థించి యుండదుగదా? తండ్రీ! నేనెంత వారించినను నా వాక్యములు వినక సంబంధము తెచ్చినందుకు ఫలమనుభవించెదవు. ఇది నాదోషమే! అమ్మా! నన్నుగని పెట్టియుండవలసిన యవసరము మీకింక లేదు. ఓయీ! తండ్రీ! ఎంత దుర్మార్గపు పని జేసితివోయీ! తల్లిదండ్రులకు వన్నెఁ దెచ్చెడి నాయీ దేహము నేడగ్నిహోత్రమునఁ బడవలసినదేనా! ఏమే మీ మంచిరేఖ లున్నవనియును దీర్ఘాయుష్మంతురాల వగుదువనియును, సాముద్రికులు చెప్పిరే! కాని నాసాహసమిటువంటిదని తల్లిదండ్రులతో నొక్కరును చెప్పలేదు. తల్లీ! ప్రకృతినుడు ఘోరములై పరమ మంజులములైన యీ హస్తములతోఁ జేయుసంస్కారములను గైకొనుము. నవమాసములు మోసి నానాకష్టములఁ జెంది నన్నుఁ బెంచి తుదకు నగ్నిపాలు చేయుచుంటివా! చలిచీమనైనను బుద్ధిపూర్వకముగ ద్రొక్కియెఱుఁగని యీనా పాదములు అగ్నినెట్టు తాళునోగదా! తండ్రీ! ఆటలకుఁ బోవనొకరోజు సాయంకాలము కాలిలో ముల్లుగ్రుచ్చుకొని నారాత్రి బాధఁ జెందుచుండ నీవుబలుమారువచ్చి యోదార్చినావు కాదు. అంతప్రేమ నేడేమిచేసెదవు. ఎంతపాపము తటస్థించెను గదా! కడుపారగన్నతండ్రివి. మహాభాగుఁడవు. వృద్ధుఁడవు. అట్టినీవే కన్నకుమార్తెమాట త్రోసిపుచ్చితివికదా! ఇఁక లోకులు పాటింతురా! ఓతల్లీ! నాకిదె సాటిమాట వినుము.

తే॥ గీ॥ తండ్రికిఁ గష్టమును గూర్పఁ దలఁచినట్టి
తండ్రిద్రవ్యంబు హెచ్చింపఁ దలఁచినట్టి

న్యాయమార్గంబుఁ జూడని నాదుపేర్మి
తనయ నీకింక లేదను కొనవె తల్లి.

కన్నకూతురు కాటిలోఁ గలసి పోవుచున్నదని తలఁచు కొనవలదు. (భయానకముతో) ఆహా! ఈ బ్రతుకింకేమున్నది. మిడిగ్రుడ్లతోడను, పలువైపె భయంకరములగు నాకారములతోడను గత్తులఁ జేతంబూని యెవ్వరో వికృత రూపు లిద్దఱిటకు వచ్చుచున్నారు. ఆహా! యమకింకర దర్శనము గూడా యయినది. రోఁటయేఁ దలఁదూర్చి రోకలిపోటుకు వెరవనేల! తల్లిదండ్రులారా! నేనిఁక జచ్చుచున్నాను. తల్లీ! నీకొక నమస్కారము. నావలెనిపుడూడ చరించెదవని నాదృఢాభిప్రాయము. ఓభగవంతుఁడా! ఇఁక రెండు నిముసములు మాత్రము నాకు సెలవొసంగుము. కొంచెము నీప్రార్థనము చేసికొందును. ఓసూర్యభగవానుఁడా! నమస్కారము. ఓ తల్లిదండ్రులారా! మీకు నమస్కారములు. ఆహా! మిమ్ములను గష్టపెట్టి పెండ్లియాడుటకంటె చచ్చుటయే శ్రేయము. కాని మీముద్దుల పుత్రిక నేటితో మీఋణమును దీర్చుకొనుచున్నయది. తండ్రీ! నీయాజ్ఞ దాటలేక పోతినిగదా! ధనమును వ్యయముచేసి పిదపఁ జెంబడించుట శ్రేయముగాదు. లోకులు కాకులవంటివారు. సంఘ సంస్కర్తవగు నీవేయిట్లొనరించిన యితరులు చేయుట లెక్కయా! కాఁబట్టి నీగౌరవము గాపాడుటకె యు నేనిట్లొనరించితిని. తల్లీ! నీదుఃఖమును దిగమ్రింగుము. సహోదరీ! నావలెనీవు తల్లిదండ్రులను గష్టపెట్టవలదు. నాప్రతిజ్ఞ నెఱవేర్చుము. సంఘసంస్కర్తలారా! చాలు మీసాహసములు. చేయఁదలఁచిన కార్యము చిన్నమెత్తు లేదు. ఏలమీకీ పట్టుదలలు. అందుచేతనే కాలమంతయు నవ్యాయమార్గమున నడచుచున్నది. తలకు మించిన కార్యమునుచేయఁ దగాదు. ఓయుత్తమ స్త్రీలారా! నావలెను మీరు తల్లిదండ్రులను గష్టపెట్టక సౌఖ్యమందుఁడు. కట్నములొసంగఁబోకుము. ఓవిద్యార్థులా

రా! మీ కేల లజ్జలేదు. తల్లిదండ్రుల గర్భస్థానమున జనించి పసుల నేడ్పించి వేలకొలఁది కట్నము లేల లాగెదరు. వారికి గష్టముండదా! స్థలభాండ విసర్జనమైన కిమ్మలు జననిజనకులు దుఃఖసాగరమున ద్రోల్లరా! సర్వమమ్మించి మీ రేలసాఁకెదరు. మంచిమార్గమున ప్రవర్తిలుఁడు. ఓ దొడ్డిలోఁ బెఱుగు చేమంతులారా! నాచేమోడ్పులు గైకొనుఁడు. ఓభగవతీ! నీకొకనమస్కారము. భారతీ వందనములు. ఓపరాత్పరుఁడా! నీలోనన్నుఁ గలుపుకొనుము. నిశ్చింతగా నీపదధ్యానముతోఁ బ్రాణములను విడుచుచున్నాను, అన్నలారా! ఇఁకఁ వర్ధిల్లుఁడు. మోహమా! నాదరినుండి తొలఁగుము. భయమా! నాకడనుండకుము. పిఱికితనమా! నా దేహమునుండి పాఱిపొమ్ము, క్రోధమా; నాకోసము కొట్లాడకుము. మానమా! మంజులత వహించుము. సూర్యచంద్రతారాసమూహములారా! నన్నుఁ బరీక్షింపుఁడు. వాయుభట్టారకా! నీవగ్గిని బ్రేరేపించి పెంచి నా దేహమును గ్రహించుకొనుము (తెఱతీయును అగ్నిమంటలు కనఁబడును) ఓఅగ్నిదేవుఁడా! నా దేహమును దహింపుము. (అని అగ్నిలోఁ బడును తెర వ్రాలును.)






## షష్ఠాంకము

1 వ రంగము.

ప్రదేశము—గృహము. సుందర శివరావు.

(దాటపైన నీలాంబరి శవము పడియుండును.)

[గుణవతి—ప్రవేశము.]

గుణ—ఆహా! ఎంతఘోరము జరిగినది. ఇంత సాహసమునకు చేయునని కలనైనను దలంచి యుండలేదు. నాథా! నా బ్రతుకు బండలు గాను. ఇంక నాజీవన మెందుకు?

సీ. పెంచినారము మేము । పిల్లను ముద్దుగా
చేయించినారము । చిన్న నగలు
సంస్కృతాంధ్రంబు లాం । చక్కగా నేర్పితి
పాఠశాలకు మేము । పంపినాము
తండ్రిమాటకు నెవ । దాట లేదెన్నడు
సత్యమే పల్కును । వరముఁజూడ
ఇంటిలోఁ బనులెల్ల । నింపుగాఁ జేయును
దైవభక్తి కలాపు । భావమందు

ఆటపాటలనైన । నన్యతం బాడని
ముద్దుకూఁతురు నేఁడు । బూదియయ్యె
సర్వజీవములందు । సమమైన దయతోడ
మసలుచుండు కూఁతురు । మ్రగ్గిపోయె
గీ. పరమపావనము కీర్తన । సల్పుచుండు
సోదరీ మణిభావంబు । జూపుదయను
అట్టిమాకన్న పుత్రిక । మట్టియయ్యె
దైవమా! ఇట్లొనర్చితి । దగునె నీకు

కనకాంబ (యేడ్చుచుఁ బ్రవేశించును) అక్కా! నన్నేమి చేయఁదలంచితివి.

సీ. అక్క నీవును నేను । నరమరలేకుండ
చిన్నటినుండియు । పెరిగినాము
ఒక కంచమునఁ దిని । ఒక మంచమందున
ముద్దుగా నిద్దుర । పోయినాము
ఒకచోట నాడుచు । నొకచోట బాడుచు
హాయిగా నుంటిమి । అమలచరిత
ఒక్కగురుని యొద్ద । చక్కఁగ విద్యలు
కూర్చుని నిత్యము । నేర్చినాము
తే. రత్నములు గోరు కాంతుఁ । గలలోనైన
పెండ్లియాడ ననుచు వొట్టు । బెట్టినావు
నాదు మాటలు మనమున । నాటియుండ
నన్ను విడనాడి పోతివే । కన్నముద్దు.

కట్టా! నీవిట్టి దురన్యాయముఁ జేయుట గాడికాదు. కాని నీవ్రతము నేను భంగముచేయను. మనము కలసి మెలసి యున్న స్నేహము కాలిపోయినదని మిక్కిలి దుఃఖించుచుంటిని.

సుందర—అమ్మాయీ! యూరకొనుము.

గుణ—అయ్యో! ఇంకేమి యూరకొనుట. కన్నకూతురు కాటిలోఁ గలసిపోయినది కదా! హా! కూఁతురా. దయాళులైన మమ్ముల విడనాడి నీవేల ప్రాణత్యాగము చేసికొంటివి తల్లీ! తరచు శ్రీమన్నారాయణ ధ్యానమునకై కన్నులకు నీచేతులు అగ్గిని బడి యెట్లు మ్రగ్గినవి హా! పుత్రీ! గృహములో పని చేయునప్పుడు నీకరములకు బాధ కలుగునేమో యని భయపడి మాన్పించుచుంటినే. అట్టి నీ చేతులు నేఁడెట్లు తగులఁబడినవమ్మా! నీచేతిలో మంచి రేఖలున్నవనియును దీర్ఘాయుష్మంతురాలవనియును సాముద్రికులు చెప్పిరే. కాని యిట్టి దుర్గతి తటస్థించునని యొక్కఁడును చెప్పలేదు. అయ్యయ్యో! నిన్నీ యీబాధ భరింపఁగలను. అహా! నీమీఁదనే ప్రాణములుంచినీవే నాకు మాఱుఁడవనియు, కులదీపికవనియు నెంచి యుంటినే! అట్టియాశలన్నియు నేఁడు నిరాశ చేసితివా! మేమీ వివాహము తలపెట్టకుండిన నీకీ మరణవస్థ తటస్థించి యుండదు కదా? ఆత్మహత్య ఘోరపాపమని పెద్దలు చెప్పుదురు కదా! అట్టిపని నీవెట్లు చేసియుంటివి పుత్రీ!

సుందర—విచారించిన లాభమెంతమాత్రము లేదు.

కమల—అయ్యో! నాయనా! నేనింక జీవనుందజాల. నిత్యము నాతోడనే కలసి మెలసి యుండు నాయక్క చనిపోయిన పిమ్మట నేను మాత్రమింక జీవించుటెందుకు.

గుణ—నాకరములందును, నా యొడిలోను నుంచి యింతవఱకుఁ బెంచుకొన్న నాకుమారికను నన్నుండి వేఱుచేసి దూరమున నుంచిన ఓ! దైవమా! అగ్నిలోఁ గలసిన నాకూఁతురను ప్రేమార కౌఁగిలించుకొన నియ్యక చేసితివి కదా! ఓభగవానుఁడా! మేము చేసిన మహాపాపమేమి! మాయందుగల ఘోరము లెవ్వి! అయ్యో! ముద్దుల బిడ్డను బొగ్గులు చేసితివే!

తే. గీ. దాని చక్కఁదనమూదాని దైవభక్తి
దాని గురుసేవ వైరాగ్యమును నిరతము
గనుచు హర్షించి యుంటిని కలలోనైన
మఱువ శక్యమె కాబిడ్డ మహినిఁజూడ.

ఇంక మేమెట్లు బ్రతుకఁగలము.

కనకా—అక్కా! నాకైనఁగలుగు మక్కువంతయు నేమి చేసి పోతివి. అయ్యయ్యో! ప్రకృతకాల స్థితి ననుసరించి యనుబదేండ్ల లోఁ దీరవలసిన బాల్యయౌవన, కౌమారవార్ధకములు నీకుఁబదమూఁడవ యేటనే తీరిపోయెనా! ఓక్కా! నేనింక సహింపలేను.

సుందర—అయ్యో! పుత్రికా! మామువ్వ నీవు గడుపుదువనుకొంటినమ్మా! ఆటలాడి యాడి యింటికివచ్చి కాళ్ళునొప్పులను చు మూల్గుచు పరుండిన మొదల లేనిపోని యూంకోశనమును మనసు నఁబెట్టుకొని నీకై తపించిన నేను నిబలవన్మరణమునుఁ జూచి భరింపఁగలనా! ఈనీలావసింపకు మేమోర్వఁగలమా! ఈయకారణమరణము నీకేల సంభవించెనమ్మా! పుత్రీ! కనుపారఁ గన్నతండ్రిని, కాలయినను నేల మోపనీయక పెంచితినే! అట్టి నీవీయగ్నిఁబడి చచ్చుట చూచి సహింపఁగలనా! చలిచీమనైన బుద్ధిపూర్వకముగఁ ద్రొక్కమెఱుగని యీ నిచరణములు నాపుత్రి! మొదలంట కాల్పఁబడెనా! అహా! నావంటి మూఢుఁడు లేఁడు. నీయభీష్టముఁ దెలిసికొనలేక పోతినికదా?

(పోలీసు బంట్రోతు ప్రవేశించి)

బం—అయ్యా! సుందర శివరావుగారూ! మీయింట నిన్నను కూనీ జరిగినఁదట- నిజమేనా?

సుందర—నిజమే! అదిగో శవము (శవముఁజూపించును) పంచాయితీ చేయవలయునా? అకటా! ఇదియొక దురవస్థ తటస్థించెను కదా?

శా॥ అదియే గేహము దేహముఁ జెనిచె, భార్యాంబిడ్డలన్ దెచ్చెన,
ద్యాదియే స్వర్గము ప్రాణము సుఖము భార్యాకాశముల్
[చంద్రుఁడున్
అదియే భాస్కరుఁడున్ మహామహులు నార్యంభోనిధుల్
[దేవుఁడున్
అదియే చూడఁగ నీత్రిలోకముల భార్యాదేవతాశక్తియున్।

ఛీ! ఛీ! ఆపిల్ల నన్నెంత కసిచేసినది. కాని శాస్త్ర సమయమునకనిపెట్టి చస్తే చాలా బాగుండును. మూడుముళ్ళు కట్టాక దిక్కుతీసిపోను. ఎట్లో ధనము వారికివ్వకూడదో ప్లీడరుతో ఆలోచింపవలయును. రవంత సమయము చూడలేక పోయినదికదా! ఈగోలంతయు నెవరు పడతారు. చాలు చాలు; సంకటం బాగాగుదిర్చినది. సాధనచతుష్టయము నీపత్నివృద్ధి నొందవలసినదే. కాని నిష్నమాత్రము నాజీవనమున్నంతవరకు పోనీయను.

బసవయ్యశాస్త్రి ప్రవేశించును.

బస—నాయనా! యేమాలోచించుచున్నావు. నిన్ను గురించి పత్రికలో నెంత రమ్యముగా ప్రకటించినారో చూచితివా ?

లింగ—నేనుకోరిన తిట్టితినా! కొట్టితినా! నావిషయములు పత్రికలో ప్రకటించుటెందుకు. ఆది నాభాగ్యోదయము.

బస—నన్నొక్కనిగురించియే కాదు. ఆపిల్లల బలవన్మరణమునకు నీవే కారణభూతుఁడవఁట. ఆపిల్ల వ్రాసినయుత్తరము నిందులోఁ ప్రకటించినారు చూడుము. (అని పత్రికను చూపును)

లింగ—ప్రకటించిన న్నేమిచేయఁగలరు. పాకీముండాకొడుకులు నాకేమిభయము. ఈధాంధూములు నాదగ్గఱికిరావు. నేనెవరినో తెలియునా!

బస—"పెండ్లికొత్తిసబండ వానిని రాజయినను చేయలేఁడు" ఆలాగున అన్నింటికిని తెగించిన నిన్నేమిచేయఁగలను. చాలు చాలు నీమర్యాద.

శా॥ పున్నంబా ? యొకయింత లేదు ధనమా ? పూర్వంబు లేదింతని
వెన్నం డైనను హాయిగా దినుటయా ? యిష్టానుసారంబుగా
నున్నానంచు నెఱింగియుండ జనులీ యుర్వీతలంబందునన్
మన్నింతం గదలంతురే వినుమ నీ మర్యాఁద గాపాడుమా !

లింగ—ఓరీ! గాడిదా! నీవు నాకు జెప్పుట; నేవినుటయునా? చాలు చాలు; సంతసించితిని. నోరుమూయుము. ఆపిల్లవయిని నీకింత యభిమానముగలిగినది! ఇంకా పెండ్లిలేదు పెటాకులులేదు. ఇవియా నీ శ్రీరంగనీతులు.

బస—నా శ్రీరంగనీతులకేమి కాని, నీనీతులకు లోకమంతయు దూషించుచున్నారులే—నీలోభత్వము మాని హాయిగానుండుము.

తే॥ గీ॥ తనువు కాల్చిన వెంటనే ధనము రాదు
కూడఁబెట్టి తుదకు దొంగ కొడుకు బాలు
చేయఁబోకుమా మానుమా చేష్టలిపుడు
యశముఁ గాంచుమీ లోకంబునందు నీవు.

లింగ—చాలింక నోరు మూయుము.

బస—నీవింకేమి యనుకొన్నను సరే; కట్నము మాత్రము నాకక్కఱలేదు.

లింగ—ఓరీ, నాకొంప ముంచకురా ! ఆమాట అనకురా ? నా కడుపు నిల్పరా ?

బస—నా యభిప్రాయప్రకారము సలుపుము.

లింగ—నీవు లోనికిఁ బొమ్ము. ఇంక నోరెత్తకు. ఎన్ని పర్యాయములు చెప్పినా బుద్ధిలేదు.

అంకయ్య ప్రవేశించును.

అంక—శాస్త్రిగారూ! అబ్బాయిని కోపపడుచున్నారేమిటి?

లింగ—ఏమి చెప్పను. నాబ్రతుకంతా యిలాగున్నది. అంతా వ్యయమే కదా! (కొడుకుతో) అబ్బాయీ! లోపలకుపొమ్ము.

బస—(నిష్క్రమించును)

లింగ—ఈరోజులలో కుఱ్ఱవాళ్ళు కారండి. అల్లరిముండాకొడుకులు కదా? చెప్పినమాట వినరు కదా?

అంక—లింగయ్యగారూ! సుందరశివరావుగారిచ్చిన సొమ్ము వారికి తిరిగి వప్పగించవలెనుగదా? ఆమాట నాకేమి చెప్పినారు?

లింగ—అయ్యో! అయ్యో! నాకొంపముంచావే; యీమాట నీవద్దనారన్నారా యేమిటి?

అంక—(తనలో) ఆహా! మంచి సమయందొరికినది. ఇప్పుడు బెదిరించి యేమయినా లాగవలయును. లేదా నాకొంపకూడా నదిలో పెట్టాలి (ప్రకాశముగా) బాబూ! నిన్న నీవాతో చెప్పినారు. కొన్ని కారణాంతరములచే మీదర్శనము చేయలేదు.

లింగ—అయ్యా! శాస్త్రిగారూ! మనది పూర్వస్నేహముగదా? మీరేదో సర్ది చెప్పవలయును. ఈవ్యవహారములో పనిచేసిపెట్టితే నీమేలు మఱువను. నీయిష్టానుసారము సొమ్మునర్పించేస్తాను. శాస్త్రిగారూ! నాబ్రదుకు చూస్తూయున్నారుకదా?

మ॥ వెనుకన్ గోయియు ముంగలన్ బావియయి ప్రాప్తించెగదా కష్టముల్
తనయుండా వినఁడయ్యొ మాటలు దరిద్ర దేవత ప్రాంతమున్
దనువుం జేరుచు బాధపెట్టెనిపుడు ధాత్రీతలంబందునన్
ధనమాపోవుచునుండెఁ దోఁచదిఁక నిద్రాహారముల్ లేవుగా!

అంక—లింగయ్యగారూ! బాధచేత మరణించకండి! మీకంత యుపకారము చేస్తాను.

అంక—అమ్మాయీ! నీయిష్టమేమి?

కమలా—మా తల్లిదండ్రుల యభిప్రాయమేదియో నాదికూడనదియే.

సుందర—అంకయ్యా! మాఅమ్మాయిమాటకు జవదాటదు.

కమలా—అయ్యా! శాస్త్రిగారూ! పెద్దలయిష్టానుసారంబునకు వ్యతిరేకింపఁజాలను.

అంక—బాగుగా నాలోచించితివా?

కమలా—తప్పక పెండ్లి చూడెదను.

సుందర—అంకయ్యగారూ! మాఅమ్మాయి అంగీకరించినది కావున సంబంధము చక్కఁజేయుఁడు.

అంక—సరే! నేను పోయి యావత్తు సిద్ధపరిచెదను. మీరి తయు బాగుగాచేయుఁడు.

(కమలాంబ తప్ప అందఱు నిష్క్రమింతురు)

కమలా—అక్కా! నీమతమునకు నష్టుగాజనుచున్నాను. కాబట్టి నాయందనుగ్రహింపుము. ఎందుకంటివా? ఈసంఘదురాచార విషయమయి లోకమునకు బుద్ధికలుగఁజేసెదను; కాని నీయందెంత మాత్రము నాకయిష్టత లేదు. అంతయు నీకసిదీర్చుకొనుటకే యిట్లు చేయుచున్నాను. అంతయు నీకిష్టానుసారంబుగా జేసెదను. నాయొక్క యంతరంగము నీయంతరంగము. కావున సంఘదురాచారమును చక్కగా చంపెదను.

(తెర వ్రాలును)

---




## సప్తమాంకము.

### మొదటిరంగము.

(ప్రదేశము లింగరాజుగారి సౌధము)

(ప్రవేశము:—లింగరాజు భద్రావతి)

లింగ—ఏమే! నిన్నను పెండ్లివారింటికి వెళ్ళినావుకావేట.

భద్రా—నగలు లేకుండా విధవముండలాగున పెండ్లివారింటికి వెళ్ళిన నవ్వరా? ఇంటిలో శుభకార్యమగునప్పుడు కూడా నగలు పెట్టెలోనె పెట్టుకోవలయునా? ఆనగలు నాకిచ్చిన నెంతందముగా నుండును.

లింగ—బాగానేయున్నది, ఏదో తొందరపనులమీద అడావిడిగ తిరుగుచున్నానుగదా! ఆసందట్లో నీనగలు గొడవ నాకు జ్ఞాపకమా?

భద్రా—ఆహా! ఏమిచమత్కృతిగా మాటాడుతారు. నగలు చివఱకుయివ్వకుండ తప్పుకొనుటకా! యీసాధనములు. ఎప్పుడు

లింగ — వెఱ్ఱిమొగమా! నేను చెప్పవలయునా? అప్పడములు, వడియములు, పోపుసామానులు, బియ్యము, నేయి, నూనె, అరిసెలు, మిఠాయినున్ని మొదలయినవి.

భద్రా — జాగ్రత్తగా నుంచుకొందురు ?

లింగ — మనబజారులో వేలంవేయించుటకు.

భద్రా — ఆహా! ఎంతపనిచేయుచున్నారు. పదిమందివిన్న ఛీ, ఛీ, యని మనమీఁదవూస్తారు.

లింగ — అలాచేస్తే డొక్క చీల్పించి డోలుకట్టిస్తాను. ఎవరు సొమ్ము అమ్మినానని అల్లాగంటారు. మొన్న సోమయాజుల సూరయ్య గారు అమ్మించలేదూ! సరే! నామాటలన్నీ వినవ్వవుకదా! అలాగున చేయుము. నగలు సిద్ధపరిస్తాను. (అని ఇద్దఱు నిష్క్రమింతురు.)

(2 వ రంగము. సుందరశివరావుగారు ప్రవేశింతురు)

(స్థలము పెండ్లిపందిరి)

సుంద — ఈరోజులలో నయిదురోజులపెండ్లిచేయుటకంటె రాజసూయయాగము చేయుట మిక్కిలిసులభము. రామ. రామ. పెందల కడ భోజనమునకు రమ్మన్న ఎప్పుడాకలిలేదనియు వాలస్యముగా పిలిచారనియు, కాఫీత్రాగినామనియు, కడుపునొప్పిగా నున్నదనియు, చెప్పవారేకాని త్వరగా భోజనమునకు వచ్చువాఁడొకఁడు లేడు. ఈరోజులలో దురలవాటు ప్రారంభమయినది. కాఫీలు, ఉపమాలు, ఇడ్డెనలు, పెసరట్లు, దోసెలు, ఇవన్నియు నుదయమున కాఁగానే పెండ్లివారికి ఖర్చవలయునఁట.

(అంకయ్య ప్రవేశించును)

అంక — సుందరశివరావుగారూ! నమస్కారములు, అంతా బాగా నెఱవేరింది. కాని, లింగయ్యగారు సదస్యము బాగాచేయలేదు.

అందఱు అలోమని యేడ్చినారు. అర్ధణాకంటె యెక్కువ సంభావన యివ్వలేదు. పోలీసువారిని తండిరిచుట్టూ పెట్టించినారుకదా?

సుంద — శాస్త్రీ! వివాహాలు సలక్షణముగ జేయుట యీరోజులలో మహాకష్టము.

అంక — అవునండి! బహుకష్టం. సిన్న వియ్యపురాలికిచ్చు లాంఛనములలో, కొంత తగ్గినదట. అందువల్ల సుముఖులు పేచీపెట్టారు. నిన్నరాత్రి పెండ్లివారి నాక్షేపించినారట. అన్నోకలగవు. వంటలు బాగావండలేదట, ఈసంగతి పెండ్లికొడుకు సవతిమేనమామ భార్యా చెల్లెలు అన్నదట. వియ్యపురాలు లాంఛనములక్రింద సొమ్ము కొంత యిస్తానన్నారట, అది యీవేళ యిప్పించండి. పెండ్లివారు వెళ్లిపోతున్నారు.

సుంద — సరే! అదనమిస్తాను. (లోపలకు వచ్చి) (తనలో) ఆహా! వివాహముచేసి చూడు, యిల్లుకట్టిచూడు అన్నమాట వ్యర్థము కాదు.

అంక — తండులుగారూ! ఆలస్యంచేయకండి. త్వరగారండి.

(అని యిద్దఱు నిష్క్రమింతురు)



ఇంటిలో యీపోరు, వీధిలో ఆపోరు, (పరికించి) కాలుచప్పుడగుచున్నది. ఎవరో వస్తూయున్నట్లున్నది. (అని లేచును)

ఒక పౌరుడు—(నమస్కారముతో ప్రవేశించి) అయ్యా! శాస్త్రిగారూ! ఆయివేల వందనాలు. అందులో అన్నీ మీకే సుమండీ!

వెంగ—ఓయీ! నువ్వా! నీవటోయీ. దరాకుగానున్నాను. ఎవరో అనుకున్నాను. ఏమిటి సంగతి యీలాగున వచ్చావు?

వెంక—మొన్న మీతో మనవి చేశాను. ఆసంగతి కోసం యీలా వచ్చాను. అందు విషయమై మీరేమి చేస్తారో యని భయపడి పరుగులిడుతూ వచ్చినాను.

వెంగ—దానికేముందోయి! ధనం దారి చూపించ లేమి చేస్తుంది అది ముందు. యిదివెనుక కాబట్టి కార్యం కావలయునంటే కాసు ప్రధానముగదా! కాసు లేంది నాలు నడువదు.

వెంక—అందు విషయమై మీరేమి ఆలోచించ వద్దు. అన్నీ నేను అనుకూలముగా చేసినాను.

వెంగ—బాగానే యున్నది. చెప్పినా గాని వినకున్నావు. పైసా లేనిదే పీనుగయినా బయటకు పోదన్న సంగతెరుగుదువా!

వెంక—అయ్యా! పెద్దలు రక్షింపాలి.

వెంగ—పిచ్చిముండా! రెండు దినాలనుండి నీయింటి చుట్టూ తిరిగి సంగతంతయు చెప్పి సంచులు తీసికొని వస్తే కాని వ్యవహారం సాగదని చచ్చిచెడి చెప్పినందుకు నామాట లక్ష్యపెట్టకున్నావు. కాబట్టి నీయింటిలోనుండి నిను వీధిలోనికి వస్తూయున్నది. దానికయి మూడు రూపాయలు ఫైను.

వెంక—అధికారులు మీరే ఆగ్రహిస్తే మేముండ గలమా! రక్షించండి.

వెంగ—చాకలివానిచేత సావిడిలోనుంచి వీధిలోకి నెళ్ళ గొట్టిస్తాను. కదలమంటే కదలవేం!

వెంక—పెద్దలు, ధర్మస్వరూపులు, అధికారులు అని అతి వినయముతో బ్రతిమాలుచుంటే మాటకి మాటకి గోటుగా తిరుగుతున్నావు. నీకు గర్వ మధికమయినది. బ్రతివాని కాళ్ళు చేతులు బట్టుకొని రాత్రిం బవళ్ళు నిద్రాహారములు లేకుండా యీచచ్చుపదవిని సంపాదించినావు. ఇంతకుముందు నా ఓటుకోసం గోలనెత్తి నాయింటి చుట్టూ తిరిగి తగులడ్డావు కాదు, అప్పటి నాసహాయం యిప్పుడు మఱచితివా! పైసా లేకుండా పాకము పని జరగదంట. ఇవియా నీ శ్రీరంగనీతులు. ఈముష్టిపదవి యున్నమూడురోజులు మాటమీద నిజం కూడా వుంచవు కదా! అప్పుడు ఓట్ల కోసం పడ్డపాట్లన్ని పరాకుపడ్డావు. ఓరిచండాలుడా! ఎంతపనిచేశావురా! అదృష్టవశాత్తూ నీకీ పదవి వచ్చిందికాని లేకపోతే ముష్టిచెంబు ముఖ్యంగా వచ్చును. ఇంతకంటె పన్నేమి చేస్తావు. నీఓటు నాకు ముఖ్యముగా యివ్వవలయును సుమండీ! అన్న అభాగ్యుడవు? యిప్పుడు నామాటంటే తలంపవు. ఈమాటు పిలవని పడతావుందు. కుక్కలపాలు నక్కలపాలు చేస్తావుందు ముఖ్య బంధువుకదా యని మూడురోజులు నిద్రాహారములు లేకుండానీకోసం నిప్పులు కప్పుకుంటూ కాళ్ళుయిగ దిరిగినను దయాదాక్షిణ్యం లేకుండా యెంతమాటన్నావు! ఓట్లకోసం వూరంతా త్రిప్పినావు కాదు. ఇంత పొంగి పోర్లపడకూడదుసుమీ! నాయుసురు నీకుఁ దగులుతుందిసుమా! ఇంక నాకు సెలవు. నేను నీదగ్గర నుండకూడదు. (అని నిష్క్రమించును.)

వెంగ—ఓరీ! ఎంతెంతమాటలన్నావురా! నామాటంటే గ్రామమంతటికిహడలు. అలాటి మనిషికి యీలాటి తిప్పలుత్పత్తిల్లాయి.

ఈవిధవ కలంబడి కొట్టినా కాని యీలాగు పొద్దులాగుండవలసినదే! నా అధికారము అల్లునిమీదే కాని పిల్లమీద చెలాయించినది కాదు, ఇంతకూ నాకర్మం. అందరికయినా అధికారం చేస్తే సాగుతుంది? దద్దమ్మమీద ధూంధాములు నిర్వహిస్తాయి. కాని గట్టివానిదగ్గఱ క్ర పెత్తనం సాగుతుందీ! పట్టమాట (పరికించి) ఎవరో వస్తూన్నారు.

లింగయ్య—(ప్రవేశము) పంతులుగారూ! నమస్కారములు. మీరుం బడిగా కూర్చున్నారేమి?

వెంక—అయ్యా! కూర్చోండి. తీరుబడిలేదు దిబ్బాలేదు. పార్టీలబాధలు పడలేకుండా యున్నామండీ! పదిగంటలయిందాకా యింటిలో గోల. తరువాత కోర్టులో గోల, సాయంత్రము సావిడిలో గోల, ఏమి చెప్పను. ఏమిపనిమీదవచ్చారు?

లింగ—(కూర్చుండి) ఏమి చెప్పను. మాఅబ్బాయిని సుందర శివరావుగారి అమ్మాయికిచ్చిన మాట మీకు తెలుసుకదా! పెండ్లికి నాలుగువేల రూపాయల నగలుంచినాను. వివాహమై నాల్గు సంవత్సరములు కావచ్చినది. పిల్లను కాపురమునకుఁ బంపరు;

వెంక—ఇంతవెట్టి పని చేశారేమిటండీ?

లింగ—ఏమిచేయనండి. బ్రతుకీలాగయినది. వెంటనేనగలు లాగుదామని చూశాను, కాని వీలులేకఁ బోయినది. ఇప్పుడు ఆనగలు మనకు వచ్చే విధం చూడాలి.

వెంక—దానికేమండీ! అదెంత సేపండీ. అరనిమిషంలో చేయవచ్చును;

లింగ—దానికోసం నోటీను ముందువ్రాయించండి. నే సెలవు పుచ్చుకుంటాను.

వెంక—సరే. మీరు ముందు వెళ్ళండి. నేసాయంత్రం కోర్టునుంచిరాగానే వ్రాస్తాను. ఖర్చులు క్రింద కొంతసొమ్ము జమకట్టం

చండి. ఫీజు పీకులాట లేకుండా చూచుకుందాము, మొత్తం నూరు రూపాయలు వహించండి, తరువాత చూచుకుందాము.

లింగయ్య—అన్నన్న ఎంతమాట. మీరు సెలవియ్యాలా! నాకుఁ దెలియదు? (తనలో) వీడి తస్సాగొయ్యా. డబ్బుమాటే కాని వాతిమాట చెప్పడు కదా! యీరోజులలో అయినా కానీయీవిధంగా నేజరుగుతూయున్నది.

ఉ. ప్లీడరు గుమ్మమెక్క తన కే ఫీజును ముందుగ లాగజూచు మా ట్లాడినచోఁ జెల్సకుఁడకా కే ధనమిమ్మని చెప్పి భోగపుం జేడియలిల్లుదూరుతఱిఁ జేటుల కే ద్రవ్యము నాద్యువర్తకుం డాడిన మాటలే దసి మహా! విధి యెట్లు సృజించెవీరినిన్!

(అని నిష్క్రమింతురు.)

(తెరవాలును.



# వరవిక్రయము



## నవమాంకము



### 1 వ రంగము

(ప్రదేశం సుందర శివరావుగారి యిల్లు)

(కనకాంబ—సుందర శివరావు ప్రవేశించును.)

సుందర—అమ్మాయీ! నామాట వినవుకదా! కేసులు వద్దని అనేక పర్యాయములు చెప్పినాను.

కనకా—నాయనా! మీరిందువిషయమై యదలకుడు. అన్నియు నాచేతిలో నున్నవి. అన్నియు నేను చక్క చేసెదను. నోటీసు యిటు తెండు.

సుంద—ఇదిగో (అని యిచ్చును.)

కనకాంబ—పుచ్చుకొని చదువుచుండును.

(రిజిస్టరీ నోటీసు)

మహారాజశ్రీ యం. వెంకటశాస్త్రి
(B. A. B. L.) బి. యే. బి. యల్.
హైకోర్టు వకీలు.
వారి ఆఫీసునుంచి

మహారాజశ్రీ
కోశాల సుందర శివరా
వుగారికి యీనాందార్లు

మా క్లయింటున్నూ లోభికొయ్యలొల్లయ్యగారి కుమారుడు లింగయ్యగారు మాకుయిచ్చిన సంజాయిషీ ప్రకారం మీకుఁ దెలియఁజేయునదేమనఁగా?

మీకుమార్తెను అత్తవారింటికి పంపించక వస్తువులను అపహరించవలెననే దురుద్దేశమున్నట్లున్నూ మా క్లయింటుకు తెలిసియుండిన్ని సదరు హీలవల్ల మీరు లగాయిదాను పొందుతూ యుండిన్నీ పిల్లను కాపురమునకు పంపిస్తామని కాలయాపన చేయుటయే కాని, పిల్లను కాపురమునకుఁ బంపుట కాని, సదరు వివాహకాలమందున అత్తవారు పెట్టిన నగలు యిచ్చుట కాని లేదు. కాఁబట్టి యిందుమూలమున మీకు దెలియఁ జేయునదేమనగా, యీనోటీసు అందిన రెండురోజుల లోగా మీ కుమార్తెను వస్తువులసహితం కాపురమునకు పంపించి వస్తువులు ముట్టినట్లు మా క్లయింటు వల్ల క్రమమయిన రశీదు పొందవలెననిన్నీ లేని యెడల మీపయిన దావా క్రమప్రకారం కోర్టు ఖర్చులతో సహితం రాఁబట్టుకోబడునని యిందుమూలముగా తెలియచేయడమయినది.

చిత్తగించవలెను.

యం. వెంకటశాస్త్రి

వకీలు. బి. యే. బి, యల్.

నాయనా! దావాచేయనీయుఁడు. సమాధానమేమియు నీయవలదు.

సుందర—దావాచేస్తే మనమేమిచేయఁగలము. అదికాకుండా ఆడవాళ్ళు కచేరీలవెంట తిరగడం మంచిపనికాదు. ధనమా? వ్యయము దారుధ్యమా? తప్పెను.

కనకాం—తండ్రీ! ఎంతమాత్రం విచారించవద్దు. ఇదివరకు ధనముతో పాటు యీద్రవ్యము కూడా ఖర్చుపెట్టుము. మీరుచింత పడకుఁడు. అన్నియునాకు తెలియును.

సుందర—నీయిష్టము తల్లీ! చిన్నపిల్లవు కాఁబట్టి చెప్పుచుంటిని. మనవారి నలుగురినోటిలోఁ బడుట నాకిష్టము లేదు

కనకా—ఇదివఱకుకంటె నెక్కువ కాదు. మనగృహస్థితి బాగుండలేదు. నీకీవిషయములో నెంతమాత్రము భయము లేదు. సర్వసిద్ధముల భగవంతుఁడే సాయపడును. త్వరగా భోజనమునకు లెండు విచారింపకుఁడు

సుందర—అక్కా! ఆవిధముగా నయినను దుఃఖించుచుంటిమి. నీవు మమ్ములను గాపాడుదువని నమ్మియుంటిమి. యీలాగు చేయుట పాడి కాదు.

కనకాం—తల్లీ! నామాట వినుము.

(ఇరువురు నిష్క్రమింతురు)

---

2వ రంగము.

---

మునసబు కోర్టు

(న్యాయాధిపతి. ప్లీడరు వెంకటశాస్త్రి, లింగయ్య, బసవయ్య శాస్త్రి-సుందరశివరావు-కనకాంబ వగయిరాలు ప్రవేశింతురు.)

వెంగ—అయ్యా! పార్టీలందఱు సిద్ధముగా నున్నారు. కోర్టువారు పిలిపించండి.

న్యాయా—సరే; పిలిపించెదను. రికార్డంతయు సిద్ధముగా నున్నదా? జవాను! పిలువుము?

వెంగి—జవాన్, బసవయ్యశాస్త్రిని సుందరశివరావుని పిలువుము?

జవాన్—బసవయ్యశాస్త్రి! సుందరశివరావు!

(అని మూమ్మారు పిలుచును)

బస—అయ్యా! నమస్కారములు.

వెంగ—కేసులో సాదిస్తీ సాక్షులు సిద్ధముగా నున్నారు. విచారణ చేయించవచ్చును.

న్యాయా—వెంకటశాస్త్రిగారూ! యీ కేసు కాగితములు యావత్తు చదివిచూచితిని. రాజీనామా చేయుట మంచిదని.

వెంగ—ఇదెంతమాత్రము రాజీ చేయడానికి వీలులేదు. మా కొల్లయింటు వప్పుకోనడు.

న్యాయా—నాకు రాజీచేయుట మంచిదనియని తోచినది.

వెంగ—అయ్యా! లింగయ్యగారూ! ఇటుదయచేయండి.

లింగ—(ముందుకు వచ్చి) అయ్యా! ఏమిసెలవు?

వెంగ—ఈ కేసులో రాజీపడవలయునని మునసబుగారు చెపుతున్నారు. నీకిష్టమేనా?

లింగ—నాకిష్టములేదు.

న్యాయా—నీ వెవరవు?

వెంగ—ఈయన మాక్లయింటు తండ్రి.

న్యాయా—నీవు కట్నమెంత పుచ్చుకొన్నావు?

వెంగ—కట్నములో పేచీ లేదండి. అవిషయమైన వ్యాజ్యము కాదండి.

లింగ—నాకు నగలుయిప్పిస్తే చాలండి.

న్యాయా—సుందరశివరావు! నీవేమంటావు! పిల్లను కాపురమున కెందుకు పంపించినావు కావు?

సుందర—అయ్యా! నాకుప్లీడరు లేరు. కోర్టువారిష్టప్రకారము చేయించండి.

కనకాం—అయ్యా! మీరు అధికారులు. అంతయు మీ స్వాధీనములో నున్నది.

వెంక—అయ్యా! యీకేసులో ముఖ్యురాలీమె!

న్యాయా—అమ్మాయీ! నీవేమి చెప్పదలచితివో చెప్పుము?

కనకా—అయ్యా! ఇందు నాజనకునిదోషమేమియు లేదు.

న్యాయా—నీవు అత్తవారింటికి వెళ్లెదవా?

కనకా—అయ్యా! నేను అత్తవారింటికి వెళ్ళనవసరము లేదు. ఇందు చాలాఅన్యాయము కలదు. అంతయు మీరాలోచించి న్యాయము దయచేయుడు.

లింగ—నీవు మాయింటికి రానవసరము లేదు మానగలు మాకు పాఱవైచిన జాలు.

కనకా—నగలు మీకీయనవసరము లేదు.

న్యాయా—ఎందుచేత? వారు పెట్టిననగలు వారికియ్యవలదా?

కనకా—ఇయ్యవచ్చునుగాని, పెండ్లికాలమందు నాకిచ్చుట చేత నది స్త్రీధనమైనది, అది వారుతిరిగి పుచ్చుకొనుట కధికారము లేదు.

లింగ—ఆహా! ఎంతయాలోచన వున్నదే! ఇంతకు నీవే నాకొంప తీసినావు.

వెంక—అయ్యా! లింగయ్యగారూ! అల్లరిచేయకండి. అంతా నేనడుగుతాను.

లింగ—ఏమడగడమో కాని, నోటిలోనుంచి మాటరానియ్యరు.

వెంక—అయ్యా! కలకత్తాలో గంపెనువ్రాసినాడు. ఈపిల్ల మాటాడుటకు నెంతమాత్రమునధికారము లేదు. తండ్రిమీద దావా చేసినాము గనుక తండ్రి మాటాడవలయును.

న్యాయా—నేను మాటాడవచ్చునని చెప్పినాను.

లింగ—అయ్యా, నాసొమ్మంతయు నష్టమయినది.

వెంక—అబ్బా! ఊరుకొనవయ్యా! నేను మాటాడుతూయున్నానుకానూ?

న్యాయా—అమ్మాయీ! నీవు అత్తవారింటికి యెందుకు వెళ్ళవు?

కనకా—న్యాయముగా వివాహముజరిగిన మొదల అత్తవారింటికి వెళ్ళుట భావ్యమే.

వెంక—అయ్యా! నామాటవినండి "బాంబాయి ఫార్టీసిక్సు" లో బోల్డు వ్రాసినాఁడు. అత్తవారింటికి రానిపిల్లను కాళ్లు చేతులు కట్టి తీసుకువెళ్లుమన్నాఁడు.

న్యాయా—అయ్యా! కొంత సేపుమీరు వూరుకొనుఁడు. యీ పిల్లంతయు చెప్పినతరువాత మీరుమాటాడండి. అమ్మాయీ! యీ పెండ్లి యెందుచేత అన్యాయము?

కనకా—అయ్యా! మీరు యీరశీదులు చూడండి. సూతేంద్రి గారు పది వేలరూపాయలకు పెండ్లికుమారుని క్రియమునకుఁ దీసికొంటిరి. (అని రశీదు లిచ్చును.)

న్యాయా—(చదువును) ఆహా! ఇదంతయు చిత్రముగానున్నది. నేనెన్నఁడు యీపెండ్లిని చూడలేదు. ఈరశీదులు వారిచ్చినవేవా? వెంకటశాస్త్రిగారూ!

వెంక—ఇవి అన్నియు అన్యాయము. కల్పింపఁబడినవి. నావ్రాలు కాదు, ఫోర్జరీ చేశారండి.

న్యాయా—ఆహా! ఇదంతయు పెద్దగందరగోళముగా నున్నదే! ఈరశీదులు మేము వారిచ్చినట్లు నమ్మినాము.

బసవ—(ప్రకాశముగా) అయ్యా! నాకుతోఁచినదియుఁ దెలిసినదియు చెప్పుచుంటినివినండి. నాతండ్రి పది వేలరూపాయలకు నన్నమ్మి

సమాట వాస్తవము. నేను పామరుఁడనై భార్యను కోర్టుకెక్కించితిని.

న్యాయా—వారిర్వురికి కారణము యీపిల్లవాఁడే చెప్పినాను. ఇందెంతయు నబద్ధము లేదు. వీరలన్యోన్యమైత్రిగలిగి మెలఁగుదురు.

బస—అయ్యా! నాయభిప్రాయమంతియే—

న్యా—సరే! మీరు మాయిల్లకుఁ బొండు.

(తెరవ్రాలును)

నవమాంకము

సమాప్తము.






# దశమాంకము

### మొదటి రంగము.

ప్రదేశము—రాజవీధి—(ప్రవేశము సుందరశివరావు, కనకాంబ, బసవయ్యశాస్త్రి, గుణవతి)

సుంద—ఆహా! ఏమి! యీకలికాలవైపరీత్యము: ఓమహా జనసమూహములారా! ఇప్పటికైనను బుద్ధిగలిగి మెలంగుడు. ఏమి! మీనడవడిక లిట్టివా?

సీ॥ ఇల్లుమాన్యంబులు । గుల్లచేయఁగ నెంచి
కట్నంబులఁ గోరు । ఖరములార
విద్యావిహీనత । వీసంబు లేకున్న
కట్నమే తలచెదు । కాకులార
పూర్వార్జితంబేని । పొందుగా లేనిచో
కొసరి కట్నములాగు । కుమతులార
లాంఛనంబులు మీకు । లక్షగా నిచ్చిన
తృప్తితీరని పాడు । తొత్తులార

గీ॥ భావ్యమే యిది మీకు మీ ♦ భావమందు
కలవె శాత్రిని పూర్వంబు ♦ తలచిచూడ
కట్నముల బాధ మాన్పంగ ♦ కరమునందు
ఒట్టునిడి పొందు నేడు మీ ♦ కౌర్యగాను.

అన—ఓవిద్యార్థులారా! శుల్కముల గోరు సుంతలారా! సంఘదురాచారములను చంపరా?

సీ. పొట్టగోసిన గాని ♦ పొడియక్షరంబేని
లేదుగా చూడంగ ♦ రేచులార
మస్తుగా భుజయించి ♦ మస్తులన్ ధరియించి
బడికిబోవని భూరి ♦ బండలార
క్రాపింగుచక్కగా ♦ గత్తిరించి తిలకంబు
మోమున బెట్టెడి ♦ మూర్ఖులార
అందమే గాని వి ♦ ద్యను గోరకుండెడి
మార్గంబు జూచు దు ♦ ర్మార్గులార

గీ॥ ఇస్త్రి బుద్ధులు గలిగి మీ ♦ రెల్ల కట్న
ములను గోరుచుండిరి చాలు ♦ మూఢులార
సంఘ యీదురాచారంబు ♦ సాహసించి
మాన్పగా నెంచుడీ భూరి ♦ మహిమయందు.

అన—ఓసహోదరులారా! సుశీల సమూహములారా! మీకేటికిమాతృగర్భమున కపాయముగలిగించెదరు. నేటిసంఘదురాచారములు వీక్షించుట లేదా? మీశరీరములకు నాటుటలేదా? తల్లిదండ్రులను కష్టపెట్టి మీకయి మడి మాన్యంబుల నమ్మించి వేలకువేలుకట్నములు పోయపూనుచుంటిరా? చాలు, యీపాటికి లోకజ్ఞానులయి పరివర్తిల్లుడు. మీకై నిత్యము వంతజెందు తల్లిదండ్రులను గాంచుట

లేదా? కష్టానుభవంబు లేదా? ఏటికి, యీదుర్మార్గము. నామాటలే పాటి సేయుదు.

సీ॥ చిన్ననాటయు నుంచి | ప్రేమతోఁ బెత్తిగి మీ
తల్లిదండ్రులతోడ | తగవు లేల?
విద్దెబుద్ధులు నేర్పి | ముద్దుగాఁ జూచిన
తల్లిదండ్రుల తోడ | తగవు లేల?
పుట్టిన దాదిగా | బూజించు మిమ్ముల
దల్లితండ్రుల తోడ | తగవు లేల?
నగలు నాణెంబులు | నయముగాఁ బెట్టుమీ
తల్లిదండ్రుల తోడ | తగవు లేల?
గీ. కట్నములు గోసి మగలతోఁ | గాపురంబు
చేయుకంటె నూతనుఁబడి | జీవములను
బాయుటే శ్రేయమిటు మీకుఁ | బడతులార
తగవులాటలు మానుఁడీ | ధరణియందు

మఱియు

సీ॥ కట్నాలగైకొని | ఖండించు మగలతోఁ
గాపురంబును జేయు | కాంతలార!
తగినవెల నొసంగి | దండించు భర్తతోఁ
బల్లకీలో నుందు | పిల్లలార!
కొండగోడుల నమ్మి | కొని తెచ్చు కొన్న మ
గలతోఁ మెలంగురేమా | కన్నెలార!
మీ పెండ్లికై చేయు | మీ తండ్రి యప్పులు
మాది యానందించు | సుదతులార!
గీ॥ తలచి చూడంగ మీ చర్య | ధరణియందు
నీచకము గాదె వేఱొందు | నింద లేల?

చాలు మీరింకఁ గీర్తితో ǂ సంచరించి
కట్నముల బాధ మాన్పుడీ ǂ కాలమందు.

గుణ—అకటా! ఏమి! యీకలికాలమహిమ! మగబిడ్డలంగన్న వారా యయ్యారులార!

సీ. మగవాఁడు పుట్టంగ ǂ మర్యాద లేకుండ
కట్నమే లెక్కించు ǂ కాంతలార!
మగలతో నిత్యంబు ǂ తగవులాటను బెట్టి
శుల్కమే కోరు వారా ǂ సుదతులార!
పెండ్లిలో మధ్యన ǂ పేచీలఁ బెట్టి లాం
ఛనములు లాగుకొం ǂ చారులార!
అయిదురోజులు ǂ పెండ్లి హాయిగా లేదని
బాధపెట్టెడి గొప్ప ǂ యుధములార!
తే. గీ. ఆడువారలు కారు! మీ ǂ రకట! యిటుల
పాడియే! కయ్యములఁ బెట్టి ǂ గాసి కుడుపు
చాలు మీరింక మానుడీ ǂ పగసములను
మెలఁగి సత్కీర్తిఁ గలుగుడో ǂ వెలఁదులార!

మ. ఫలహారంబులు నిత్యము న్మెసఁగినన్ ǂ మర్యాదతో జూచినన్
గలకోర్కెల్ దగఁ దీర్చి సిరులతోఁ ǂ కల్యాణమున్ జేసినన్
గలవిన్నాయిఁక లోకమున్ యనుచు నే ǂ కాల్లాటనో పెట్టి మీ
రిలలోఁ జేసెడి ఘోరకృత్యములు నే ǂ నేమందు భాషించఁదగ.

ఓ యక్కలారా! ఈయన్యాయ వర్తనము పాడికాదు. వెంటనే విసర్జించుటయే యుక్తము.

ఒక విప్రుఁడు-(ప్రవేశించి) ఆర్యా! కట్నములు పుచ్చుకొనుట కంటె కాటిలోఁ గాపురముసేయుట మేలు. అందుచేతనే నాకీదిక్కుసంభవించినది.

సీ॥ పెండ్లి కాదంచు నే పిల్లవానిని గొట్టి
పాఠశాలకు ముందు పంపినాను
యేడ్పించి కట్నంబు వేలకువేలుగాఁ
బుచ్చుకొంటిని నేను పొందుగాను
చీటిమాటికి నేను చీవాట్లు పెట్టి గ్ర
హించినాడను పెక్కు లాంఛనములు
ఆసామ్ములో నేను హాయిగా శాధంబు
కట్టించి అద్దికి బెట్టినాను

గీ. ఇల్లుపడిపోయె చనిపోయె నింటివిపుడు
కాలిపోయెను మంటలోఁ గన్నకొమకు
కోడలా లేచి పోయెను కూఁతు లేదు
బాధపడలేను కట్నాలు వలదు వలదు.

అయ్యా! నాగోడవయింకాచాలా కలదు. ఆనక ఆలోచించుకొందాము.

ఒకకమ్మ (ప్రవేశించి) అయ్యా! నేఁజెప్పుగోడవకొంచెము వినండి?

సీ॥ కష్టించి కష్టించి కాయంబు చెమటూర్చి
చేర్చినాడను పెద్ద చేను లెన్నొ
కలభూములన్నియు కట్నాలకిందిచ్చి
ప్రేమతోఁ బిల్లన ర్పించినాను
అందంబుగా నేను అలక పానుపుకాడ
ముట్టజెప్పితి నాఁడు పుట్టినూడు
సర్వంబు తిన్నట్టి చవటగాపిదెకొమ్కు
యింటిలోఁ బిల్లని గెంటినాడు

తే. గీ. తిండియూ లేదు పాత్రించఁ దిక్కులెన్ను
బిడ్డకా లేదు గట్టంగ గుడ్డయిపుడు

అల్లురకుఁ బెట్టు వాళ్ళకు ననుభవంబు
లిగిరొ, కన్నవాళ్ళకు లేను భువినిఁ గూడు।

ఒక షావుకారు (ప్రవేశించి) అయ్యా! సభాస్తారులారా! నాగోల దయచేసి వినండి.

సీ॥ చిల్లరకొట్టును సిగ్గులేకను బెట్టి
గడియించినాడను కానులెన్నొ
పిల్లను కట్నాల బేరంబులోఁ బెట్టి
అనుభవించెడి యిల్లు నమ్మినాను
అభ్యాసాక్ష్యాలు చేసి అలకపానుపు నాడ
పదివేలు గోళ్ళగాఁ బంపినాను
సంగీత సభలెన్ని చక్కగాఁ బెట్టించి
విత్తమెల్లయు ఖర్చు పెట్టినాను
తే॥ గీ॥ పెండ్లిలో వాళ్ళు తెలియక త్రేణినాను
గొప్పకోసము మాటలు చెప్పినాను
అప్పుతీర్పక కోర్టుకు నడిగినాడ
కట్నముల బాధమాన్పుడి కట్నమందు।

(నిష్క్రమించును)

రామయ్య—(కంగారుగా ప్రవేశించి) అయ్యా! కొంపమునిగిపోయింది. మాయజమాని కోర్టులో వ్యాజ్యము పోయిందనే బెంగ కంగారులచేత, గోడమీదనుంచి వస్తూ బంకిక్రిందపడి ప్రాణాలు బాయుటకు సిద్ధముగా నున్నారు.

సుందర—(భయముతో) అబ్బబ్బా! ఎంత ఘోరకృత్యము జరిగినది. రండు. రండు. పోయిచూద్దాము.

(అందఱు నిష్క్రమింతురు)

(తెర లేచును.)

లింగ—(రాజవీధిలో రోడ్డుమీద పడియుండి) ఛీ! యీదెబ్బలకు నేనెంతమాత్రము విచారించను. కాని నాకొడుకు చేసిన పనికి దిగులు చెందుచున్నాను. ఆహా! సాధనమంతయు పోయెను కదా! పాడుకొడుకు పుట్టిననేమి? చచ్చిననేమి? నాకుం గుమారుని గురించి ముఖ్యముగా మతిపోయినది. ఆహా! నేనుగడించిన ధనమంత కష్టమయినది.

సీ॥ గుడ్డలంగట్టక ♦ గూడైన తినకుండ
చిల్లిగవ్వల వడ్డి ♦ చేర్చినాను
పెచ్చువడ్డిలను ♦ బుచ్చుకొంటిని నేను
కొత్తనోటుల నన్ను ♦ కూర్చినాను
దొంగపత్రంబులన్ ♦ లొంగదీయుచు నేను
వ్రాయించినాడను ♦ పరులచేత
సంభావనలకేగి ♦ సంతర్పణలకేగి
వెనక వేసితి కొంత ♦ విత్తమేను
తే॥ గీ॥ చీదయినకుండ ముష్టికి ♦ బెట్టకుండ
పరులకొంపల మార్చినే ♦ బ్రతికినాను
యిట్టి దుర్మార్గ కార్యంబు ♦ లేను చేయ
యముడు పంపెను భటుల నీ ♦ సమయమందు.

సుందరి—(ప్రవేశించి) బావగారూ! మీకీబాధ యేలకలిగెను.

లింగ—బావగారూ! ఇదియంతయు నాకర్మము. విధివ్రాత దాటతరమా?

నేనన్ని దుష్కర్మము లొనరించితిని. గుడ్డిగవ్వయైన ధర్మము చేయక దాచిపెట్టితిని. ఛీ! నాజన్మమెంతపాపముచేసినదో కదా? ఎందుకు నాబ్రతుకు. భార్యయు నిందించుచున్నది. కుమారుడు దాచుకొంచినాడు.

కాఁబట్టి యాధనము నాకుఖూత్రింబొందుకు నాకుగౌరవము లేదుకదా? కాఁబట్టి శ్రీమహాత్మాగాంధిగారి సేవయే సతము చేసిపుణ్యముగణింతును.(జనులనుద్దేశించి) ఆర్యులారా! సకలపుణ్యకర్మలకాకరమై పుణ్యభూమియని ప్రకంచకునఁ బేరెన్నికఁగన్న యీ భాగవతభూమియందు ననేక సుపుత్రులుదయించి సంఘదురాచారములు మాన్పఁజాలకుండిరికదా! నేటికి వాఁడలు బయలువెడలి ప్రయత్నించుచుండెను. కాఁబట్టి నావలె మీరును సంచరించక యత్నములకావలి కష్టపడకుడు. నేను మహాపాపిని. సంఘదురాచారముల వృద్ధిచేసిన చవటను, విప్రకులాధముడను. కాఁబట్టి లోకజ్ఞానము గలిగి సంఘదురాచారములు బాపి సహాయము నర్పుఁడు. ఇవియే నాయొక్క వందనములు.

తే॥ గీ॥ ధరణి యీతిబాధలు లేక తనరుఁగాక
భార్యభర్తలన్యోన్యము బడయుఁగాక
కట్నముల బాధ లేకుండ గ్రోలుఁగాక
ప్రజల నన్యోన్యప్రేమముల్ బాయుఁగాక
కాళికామీశ్వరీ కవి ప్రజలుఁగాక.

సుందర శివరావు——తథాస్తు-తథాస్తు.

(తెరవ్రాలును)

గద్య.

ఇది శ్రీరామచరణారవింద సేవనారతుండును కౌశికసగోత్రుం
డును, గరికిపాటి వంశపయఃపారావార రాకాసుధాక
రుండును, పురాణపండిత కామాశాస్త్రి పౌత్రుం
డును, వెంకటరత్న సావిత్రీ పుత్రుండు
నగు కామేశ్వరరావు ప్రణీతం
బైన వరవిక్రయ నాట
కంబున సర్వము
సమాప్తము,

# సురానంద.

(గ్రంథకర్త.—కొడాలి సత్యనారాయణరావుగారు)

మద్యపాననిరసనమును నధిక్షేపించు యాంధ్రులు గలరా? అట్టి దానిని బ్రోత్సహించు యుద్గ్రంథము పఠించు నిష్టపడనివారుం దురా? ఇదివరలో దీనిని కారణాంతరమువల్లఁ "కల్లుముంత" యని ప్రకటించితిమి. ఇదియే సురానంద యను పేరుతో వెలువడినది. చందాదారులకు పోస్టేజీతో రు 1-0-0 మాత్రమె యగును, తదితరులకు పోస్టేజితో రు 1-4-0 లు అగును. శైలపద్యములఁ దిలకింపుఁడు.

గీ. ఐకమత్యమె యున్నదా ♦ యాదులందు
ద్వేషమే లేక యున్న నీ ♦ దేశమునకు
జాతిమతకలహ లేకున్న ♦ తణికమందు
రాకయుండునె మనకు స్వ ♦ రాజ్యపదవి?

ఉ. రాళ్ళను రువ్వఁబూనుట, దు ♦ రంతరులై మితిమీఱి క్రాగియుం
గళ్ళను గొల్లగొట్టుట, వి ♦ కావికనవ్వుట, దోళ్ళదోపుగా
ఇళ్ళను నష్టగించుట, స్వ ♦ భావములౌనటుఁ జేయు క్రాగుటం
గళ్ళవినాశమున్నఁదు జ ♦ గత్తులఁగల్గునొ భారతాంబరో! 2

గీ. మద్యమా! నీవు లేనిచో ♦ యుద్యమంబు
సాగఁగాఁబోదు సిద్ధింత ♦ సాహసంబొ
కోట్లకలఁదిగ ద్రవ్యంబు ♦ గుంజుకొనుచు
వెలుఁగుచున్నావు దశదిశా ♦ వలయమందు 3

వలయువారు— గొల్లపూడి వీరాస్వామి,
శ్రీసీతారామబుక్ డిపో, రాజమండ్రి.

# పూర్వకవులపద్యకావ్యములు.



## ప్రభావతీ ప్రద్యుమ్నము
పింగళి సూరనార్యప్రణీతము 1—0—0

## బిలహణీయము
చిత్రకవి సింగరార్యుని ప్రణీతము 0—8—0

## శృంగారనైషధము
శ్రీనాథప్రణీతము 1—0—0

## శాంకవిజయము
శేషము వెంకటకవిప్రణీతము 1—0—0

## జయవిలాసము
చేమకూరి వెంకటకవికృతము 0—12—0

## పారిజాతాపహరణము
ముక్కుతిమ్మనార్యుని ముద్దుపల్కులు 0—12—0

## మనుచరిత్ర
అలసాని పెద్దనకవి విరచితము 1—0—0

## మొల్లరామాయణము
కూరి మొల్ల ప్రణీతము 0—12—0

## మునిమాపు.
గ్రంథకర్త—సహదేవ సూర్యప్రకాశరావు

వెల 1—0—0